Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు  స్థాపితం: 1930  జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 23 • 4-6-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



● మనోభీష్టం తీర్చనే

## మళ్లీ రాజ్యసభ!



నేదురుమల్లి జనార్దనరెడ్డి మరొకసారి రాజ్యసభ సభ్యుడిగా ఎంపికైనారు. ఎందరు ఎన్ని రకాలుగా మోకాలు అడ్డు పెట్టినా ఢిల్లీ రాజకీయాలలో తన చాతుర్యానికి ఎదురు లేదని నిరూపించుకొన్నాడు. 2009 ఎన్నికలలో నెల్లూరు లోక్‌సభ స్థానంలో పోటీ చేయవలసి వుండాయన. కానీ అప్పటి ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి, ఆయన్ను ఒప్పించి, ఆ స్థానాన్ని మేకపాటి రాజమోహన్‌రెడ్డికి కేటాయింపచేశారు. అందుకు ప్రతిగా ఆ ఎన్నికలకు ముందే ఖాళీగా వుండిన రాజ్యసభ స్థానాన్ని ఇచ్చారు. అయితే దాని ఆయుర్దాయం 18నెలలు మాత్రమే వుండింది. అదే స్థానానికి ఆ తర్వాత జరిగే ఎన్నికలలో టిక్కెట్ ఇస్తామని వైఎస్‌తో పాటు సోనియాగాంధీ కూడా హామీ ఇచ్చారు ఆరోజు. అందువల్లనే నెల్లూరు నుంచి లోక్‌సభకు ప్రాతినిధ్యం వహించాలన్న కోరిక ఎంతగా వున్నప్పటికీ, సోనియా మాట గౌరవించి, పక్కకు తప్పుకొన్నాడు.

జనార్దనరెడ్డి రాజకీయ జైత్రయాత్రలోని కీలకం ఈ విధేయత అన్నది చరిత్ర చెప్పిన సత్యం. తనకు ఇష్టం వున్నా లేకపోయినా, తనకెంత నష్టం జరిగినా కాంగ్రెస్ అధిష్టానం గీచిన గీటు దాటకపోవడం ఆయన రాజకీయశైలి. ఇందిరమ్మ కాలం నుంచి నెహ్రూ కుటుంబాన్ని అంటిపెట్టుకొని వున్నారాయన. మధ్యలో ఎన్ని ఆటుపోట్లు వచ్చినా చలించలేదు. పదవులు ఇచ్చినా, ఇవ్వకున్నా పద్ధతి మార్చుకోలేదు. ఆ విశ్వాసం, ఆ విధేయత ఈ వయస్సులోనూ ఆయనకు శ్రీరామరక్షగా నిలిచాయి.

మళ్లీ టిక్కెట్ ఇస్తామని హామీ ఇచ్చిన వైఎస్ బ్రతికిలేరు కాబట్టి, ఆ ఒట్టు తీసి గట్టున పెట్టించాలని కేంద్రమంత్రిణి పనబాక లక్ష్మి చేయని ప్రయత్నం లేదు. ఎక్కని గడప లేదు. రాజ్యసభ టిక్కెట్ రాకుండా నివారించగలిగితే జనార్దనరెడ్డి రాజకీయ శకం అంతమై పోతుందని; నెల్లూరు జిల్లాలో తన

కొరవ 14వ పేజీలో

● తన చేతులతో తన భవిష్యత్తు పాడు చేసుకొన్న జగన్

## పిల్లికూనైపోయిన పులి!

నడిసంద్రంలో చుక్కాని లేని నావ వలె చిక్కుక పోయాడు వైఎస్ జగన్. ఎటు పోవాలో తెలియడం లేదు. తీరం చేరే దారి కన్పించడం లేదు. నిన్నటివరకు ఓదార్పు యాత్ర అధిష్టానాన్ని జడిపించింది. జగన్‌తో పేచీ పెట్టుకొంటే పార్టీ చీలిపోతుందన్పించింది. కానీ వరంగల్ రగడతో పరిస్థితి తారుమారు. ఇప్పుడు తన నీడ చూసి తానే భయపడవలసిన అవమానకర పరిస్థితి. ఢిల్లీకి వెళ్తే, వైఎస్ భక్తుడిగా పేరుపడిన వీరప్ప మొయిలీ వంటివారు కూడా తలుపులు మూసేశారు. హైదరాబాద్‌కు తిరిగి వస్తే మంత్రులంతా ముఖం చాటేశారు. ఒంటరివాడిగా మిగిల్చారు. ముందుకు వెళ్లడానికి తోడెవ్వరూ కన్పించడం లేదు. వెనక్కు వస్తామంటే అహం అడ్డుపడుతున్నది.

ఓదార్పు యాత్ర వద్దని అధిష్టానం చెప్పలేదు. వరంగల్ పర్యటన మాత్రం వాయిదా వేసుకోమన్నది. దాన్ని వదలి వేరొక జిల్లాకు వెళ్లి వుంటే పేచీ లేదు. చిన్న తొందరపాటు పెద్ద భూతం వలె మారిపోయింది. కాంగ్రెస్ రాజకీయాలలో అధిష్టానానిది అంతిమ స్థానం. దాన్ని ధిక్కరిస్తే పుట్టగతులు వుండవు. ఈ సూక్ష్మాన్ని పక్కనపెట్టి పెద్ద పొరపాటు చేశాడు జగన్. ఇప్పుడు కార్యాచరణ ఏమిటి? అధిష్టానం అనుగ్రహం తిరిగి సాధిస్తే తప్ప కాంగ్రెస్‌లో మనుగడ కష్టం. అందుకు చాలా ఓపిక కావాలి. ఏళ్ల తరబడి మౌనంగా ఎదురు చూడాలి. వేసే ప్రతి అడుగులోనూ నిగ్రహం పాటించాలి. అంత ఓపిక ఆయనలో లేదు. అట్లని ధిక్కరించి వెళ్తే వెంట వచ్చే వారు కన్పించడం లేదు. ధిక్కరించి సాధించేది ఏమిటని వైఎస్ అనుచరమంత్రులే ప్రశ్నిస్తున్నారు. మహా అయితే ప్రభుత్వాన్ని పడగొట్టవచ్చు. దాని వల్ల మనకేమి వస్తుందన్నది మంత్రుల ప్రశ్న. వెంటనే ఎన్నికలు రావు. రాష్ట్రపతి పాలన విధిస్తారు. కనీసం ఏడాదిపాటు ఆ సందిగ్ధస్థితి కొనసాగుతుంది. అంత వరకు పరిస్థితులు అనుకూలంగా వుంటాయన్న గ్యారెంటీ ఏమిటి? ఎన్నికలు లేకుండా



కొరవ 14వ పేజీలో

# విద్యార్థులతో ఆటలా?

ఇంటర్మీడియేట్ పరీక్ష పత్రాలు దిద్ది, మార్కులు వేయడంలో జరిగిన అవకతవకలు వింటుంటే ఆశ్చర్యంతో పాటు ఆగ్రహం కల్గుతున్నది. విద్యార్థి జీవితంలో ఇంటర్మీడియేట్ పరీక్ష ఎంత కీలకమైనదో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఈ పరీక్షల్లో మంచి మార్కులతో పాసు కావడానికి విద్యార్థులు, వారి తల్లితండ్రులు పడే తపన అంతా ఇంతా కాదు. కొన్ని లక్షల మంది మధ్యతరగతి కుటుంబాలు తమ పిల్లలను మంచి కాలేజీలో ఇంటర్మీడియేట్ చదివించడం కోసం జీవితాలనే పణంగా పెడుతున్నాయి. ఆస్తిపాస్తులమ్మి ఫీజులు కట్టేవారు కొందరైతే, సంపాదన మొత్తాన్ని కార్పొరేట్ కాలేజీలకు సమర్పించి, ఒకపూట భోజనంతో సర్దుకొనిపోయేవారు మరికొంత మంది. ఇంటర్మీడియేట్‌లో మంచి మార్కుల వల్ల ఇంజనీరింగ్, మెడిసిన్ వంటి వృత్తి విద్యలు చదివే అవకాశాలు వుండడమే అందుకు కారణం. ఏ తల్లి అయినా, తండ్రి అయినా తమ కూతురు లేదా కొడుకు ఇంజనీరు కావాలనో, డాక్టర్‌గా వెలుగొందాలనో కలలు కనడం సర్వసాధారణ విషయం. ఇంటర్‌లో గతి తప్పితే ఏ విద్యార్థికైనా జీవితం కూడా గతి తప్పుతుంది.

ఇంత కీలకమైన పరీక్షలను అత్యంత అలసత్వంతో నిర్వహిస్తున్నది రాష్ట్ర ప్రభుత్వం. ఈ ఏడాది అది మరింత పరాకాష్టకు చేరింది. విద్యార్థుల పరీక్షా పత్రాల విషయంలో అధ్యాపకులు వ్యవహరించిన దారుణ వైఖరి వింటుంటే కడుపు రగులుక పోతున్నది. కొన్ని సమాధానాలు అసలు చూడకుండా వదిలేశారట. కొందరు అధ్యాపకులు సమాధానాలు చూశారట కానీ, వాటికి మార్కులు ఇవ్వలేదు. మరికొందరు అధ్యాపకులు సమాధానాలకు తాము వేసిన మార్కులను మొత్తం మార్కులలో కలిపి కూడకుండా వదలి పెట్టారు. వేరొక రకం అయ్యోర్లు అసలు సమాధాన పత్రమే చదవకుండా సున్నా మార్కులు వేశారు. ఫలితాలు వెల్లడైన తర్వాత 16వేల మంది విద్యార్థులు రీవాల్యుయేషన్ కోసం దరఖాస్తు చేస్తే, అందులో 4వేల మందికి అన్యాయం జరిగిందని తేలింది. ఒక విద్యార్థికి ఎకనామిక్స్ పత్రంలో సున్నా మార్కులు వేశారు. రీవాల్యుయేషన్‌లో ఆ సమాధాన పత్రం సరిగా దిద్దితే ఆ పిల్లవాడికి నూటికి 75 మార్కులు వాచ్చాయి. ఎందుకింత అన్యాయం చేశావని మొదటిసారి పత్రం దిద్దిన అయ్యోరిని వివరణ కోరితే, నాకు ఇంగ్లీషు రాదు కాబట్టి ఏమీ అర్థం కాలేదు, అందువల్ల సున్నా మార్కులు వేశానని నిర్లక్ష్యంగా సమాధానం ఇచ్చాడట.

ఇంగ్లీషు చదవడం రాని అయ్యోర్ల చేతిలో పరీక్షా పత్రాలు దిద్దే బాధ్యత పెట్టిన ఇంటర్మీడియేట్ బోర్డును ఏమి చేయాలి? 16వేల మంది రీవాల్యుయేషన్‌లో 4వేల మందికి అన్యాయం జరిగిందంటే ఇక మొత్తం పరీక్ష వ్రాసిన 9లక్షల 40వేల మంది విద్యార్థులలో ఇంకెంత మందికి ఇంకెన్ని రకాల అన్యాయం జరిగి వుంటుంది?

ఈ బాధ్యతారాహిత్యానికి ప్రధాన కారణం – పెరుగుతున్న విద్యార్థుల సంఖ్యకు, తరిగిపోతున్న ప్రభుత్వ అధ్యాపకుల సంఖ్యకు పొంతన లేకపోవడం. ప్రభుత్వ రంగంలోని కాలేజీలను పాడు బెట్టి, విద్యను సమస్తం ప్రైవేటు పరం చేస్తున్నది ప్రభుత్వం. అందువల్ల ప్రభుత్వ అధ్యాపకుల సంఖ్య ఏటికేడాది తరిగిపోతూ వస్తున్నది. దీనితో పరీక్ష పత్రాలు దిద్దడానికి ప్రైవేటు విద్యాసంస్థల నుంచి అధ్యాపకులను తెచ్చుకోవలసి వస్తున్నది. చాలా ప్రైవేటు కాలేజీలలో అయ్యోర్లకు కనీసపాటి విద్యార్హత కూడా వుండదు. తక్కువ జీతాలతో పని చేసే వారిని ఉపాధ్యాయులుగా నియమించుకోవడం ప్రైవేటు కాలేజీల లక్షణం. పరీక్షల సమయంలో ప్రశ్నాపత్రాలు దొంగిలించి, మాస్ కాపీయింగ్ ప్రోత్సహించి తమ కాలేజీల ప్రతిష్టను పెంచుకొనేవారే తప్ప, చదువు చెప్పి విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దే వారు ప్రైవేటు రంగంలో చాలా తక్కువ. అటువంటి బడుద్దాయి బడిపంతుళ్ల చేతులలో విద్యార్థుల పరీక్షా పత్రాలు పెట్టడం ప్రభుత్వం చేస్తున్న నేరం. విద్యార్థుల జీవితాలతో ఇంత క్రూరమైన ఆటలు ఆడడం ప్రభుత్వం చేయదగిన పనికాదు.

జమీన్‌రైతు

## జనవాణి

### రైతులకు అన్యాయం!

రెక్కలు ముక్కలు చేసుకొని వ్యవసాయం చేస్తున్న రైతుకు శ్రమకు తగ్గ ఫలితం దక్కడం లేదు. సరసమైన ధరకు నాణ్యమైన విత్తనాలు దొరకడం లేదు. అతివృష్టి, అనావృష్టి కుంగదీస్తున్నాయి. భూగర్భ జలాలు నానాటికి అడుగంటుతున్నాయి. కరెంటు కోత, అందుబాటులోలేని ఎరువులు, క్రిమిసంహారక మందులు, సకాలంలో దొరకని కూలీలు, కోతకు వచ్చిన దశలో ప్రకృతి ప్రకోపాలతో గిట్టుబాటు ధర పలకని పంటలు, ధాన్యాన్ని నిల్వ చేసుకోలేని పరిస్థితులతో రైతుల పరిస్థితి అగమ్యగోచరంగా తయారయ్యింది. అయినా పాలకపక్షం తరపున స్పందన మాత్రం అంతంతమాత్రమే.

డి.భాస్కరయ్య — కావలి

### ఆలోచింపజేసిన సంపాదకీయం!

మే 14వ తేది 'జమీన్‌రైతు' సంచికలో ఎవరిది హింస శీర్షికన వెలువడ్డ సంపాదకీయం అద్భుత, ఆలోచనాపూరిత, న్యాయబద్ధమైన సంపాదకీయం. నిస్పాక్షికంగా వ్రాసిన సంపాదకుని గుండె ధైర్యానికి అభినందనలు. మీరు ఈ సంపాదకీయంలో వెలువరించిన అభిప్రాయాలు పలువురి మదిలోనూ మెదలుతున్నాయి. గత 35 ఏళ్లుగా నేను 'జమీన్‌రైతు' పాఠకుడ్ని. వ్యాపార దృక్పధంతో పత్రికలు నడుస్తున్న ఈ రోజుల్లో సామాజిక దృక్పధంతో 'జమీన్‌రైతు' నడపడం ఆనందకరం.

డాక్టర్ డి.వి.రాజశేఖమూర్తి — తిరుపతి

### ఆలయ ట్రస్టీలకు విజ్ఞప్తి!

గ్రామ దేవతల ఆలయాలలో నవగ్రహ ప్రతిష్టలాంటివి చేయకూడదు. అదే విధంగా ఆలయాల లోపల చిన్న దేవతల విగ్రహాలను ప్రతిష్టిస్తున్నారు. ఇది కూడా సహేతుకం కాదు. దేవస్థానంలో పల్లకిసేవ, పుష్పాలంకరణ సేవల సమయంలో ఉత్సవ విగ్రహాలను ఊరేగించను స్థలమే ఉండడం లేదు. దేవస్థానంలో శాశ్వత పూజల ఉభయ దాతలకు కనీసం కుంకుమ, విభూతి, ప్రసాదాలను పంపే బాధ్యతలనైనా ఆలయ ట్రస్టీలు స్వీకరించమనవి.

కె.సుజాత — కావలి

### సెంట్రల్ లైబ్రరీలో సమస్యలు!

నెల్లూరు రేబాలవారి వీధిలోని కేంద్ర గ్రంథాలయంలో పలు సమస్యలు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

7-6-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు
### రాఘవయ్య గారి టీ పార్టీ

మన భైరవరసు హనుమంతరావు గారు బొంబాయిలో జర్నలిస్టుగా ఉత్తమ స్థానంలో వున్నాడంటే మనమంతా గర్వించతగిందే!

వీరు మొన్న నెల్లూరు వచ్చినపుడు మిత్రులు వెన్నెలకంటి రాఘవయ్య గారు వీరికి గుక్కెడు తేనీళ్లిచ్చి గౌరవిస్తూ ఆ విందుకు స్థానికంగా జర్నలిస్టు నెవ్వరినీ ఆహ్వానించలేదట. అందువల్ల జర్నలిస్టులంతా ఆ న్యూస్ ప్రకటించకుండా బాయికాట్ చేశారు. ఒక పెద్ద జర్నలిస్టులనాహ్వానించకపోవడం రాఘవయ్య తప్పే. కాని ఆ కారణంతో ఆ న్యూస్ ప్రకటించపకపోతే రాఘవయ్య చేసిన తప్పుకు హనుమంతరావు పట్ల మనం అవజ్ఞత చేసిన వారమౌతాము. కావున జర్నలిస్టు అసోసియేషన్ వార్ని ఆ విషయం మరచిపొమ్మని అడుగుతున్నాను.

### విద్యార్థినులు

మీకొక సంతోషవార్త చెవిన వేస్తాను వింటారా? నెల్లూరు వి.ఆర్ కాలేజీలో ఈ సంవత్సరం 12 మంది విద్యార్థినులు ఇంటర్ మీడియట్ పరీక్షలకు కూర్చుంటే ఇందులో తొమ్మిది మంది పరీక్ష అయినారట. ఈ తొమ్మిదిలో ఆరుగురు ప్రథమ తరగతిలో ప్యాస్ అయినారట. ఇందుకు అభినందించాలసింది కాలేజీనా? విద్యార్థినులనా?

### నెల్లూరు తహశీల్దారు

ఎ.రామచంద్రారెడ్డి గారు కావలికి ట్రాన్స్‌ఫర్ అయినాడు. 7వ తేది ఛార్జి యిస్తాడట. వీరి బదలీకి తాలుకాలోని ఆబాలగోపాలం కన్నీటి పర్యంతమయ్యారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

3-6-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నాగార్జునసాగర్‌లో పని నిలుపుదల

కృష్ణానదికి గత 22వ తేది రాత్రి హఠాత్తుగా నీరు తగిలిన ఫలితంగా నాగార్జున సాగరం డ్యాం నిర్మాణం పని ఆగిపోయింది. ఎక్కడ పని అక్కడే నిలిచిపోయింది. తుంగభద్ర నీరు కూడా వదలబోతున్నారు. పెద్ద వరదలు కూడా త్వరలో రావచ్చు. అందువల్ల డామ్ లో లెవల్ పని పూర్తిగా నిలిచిపోయినట్లే. మరలా జూలైలోగాని, ఆగస్టులోగాని పని ప్రారంభం కాదట.

### ఎర్రగొండపాళెంలో కమ్యూనిస్టుల పరాజయం

కర్నూలు జిల్లా ఎర్రగొండపాళెం నియోజకవర్గ ఉప ఎన్నికలో కమ్యూనిస్టు అభ్యర్థి పరాజయం పొందాడు. కాంగ్రెస్ అభ్యర్థి జల్కి రామిరెడ్డికి 16,672 ఓట్లురాగా, కమ్యూనిస్టు అభ్యర్థి పూల సుబ్బయ్యకు 15,449 ఓట్లు వచ్చినవి. 1955 ఎన్నికల తర్వాత కమ్యూనిస్టు అధికార అభ్యర్థి పోటీ చేయడం ఇదే ప్రథమం. ప్రథమ కబళంలోనే మక్షికం అన్నట్లుంది కమ్యూనిస్టులపని. ఇది ఇదివరలో కాంగ్రెస్ స్థానమే.

### శివారెడ్డి పద్యాలు
### ఏ.సి మంత్రి పదవి

ముష్టి మంత్రి పదవి మూనాళ్ల బాపత్తు
వూడిపోతెయేమి? వుంటెయేమి?
పత్రికోళ్లు మొదలు ప్రతినోట నీ మాటె
నెహ్రూ వరకు గూడ నీదె సోదె!
ఏ.సి ప్లెయిను మ్యాను యెవరు గాదంటారు,
చాలా పెద్ద మనిషి సంజీవయ్య

ఏమి కారణమ్మొ యెందుగ్గ బెడిసిందో
అసలు విషయమేందో అంతురాల
పత్రికల్లో న్యూసు పడ్డాదో పక్లేదో
చంకలెగర వేయ సాగినారు
కమ్యూనిస్టు, యేమిగానుందో నెల్లూరు
దిగులుగుంది, యింక దిక్కు మొక్కు

# నెల్లూరు ముచ్చట్లు

[illegible]

## శ్రీధర్‌కృష్ణారెడ్డిలో సంతోషం

ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు చిరంజీవి కాంగ్రెస్ అధినేత్రి సోనియా గాంధీని ఢిల్లీలో కలసి రావడం పట్ల నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి తెగ ఆనందపడిపోతున్నారు. నగరంలో మే 30, 31 తేదీల్లో ఆ పార్టీ నేతృత్వంలో జరిగిన డివిజన్ సభల్లో ఆయన మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీతో ప్రజారాజ్యం పార్టీకి మైత్రిబంధం కుదిరితే తమ పార్టీకే మేలు చేకూరుతుందని, చిరంజీవి ముఖ్యమంత్రి అయ్యే అవకాశాలున్నాయని చెప్పుకొచ్చారు. రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీతో జత కలసిపోయిన ఎమ్మెల్యేలలో మొదటి వాడైన శ్రీధర్‌కృష్ణారెడ్డి నోట ఇటువంటి మాటలు తప్ప మైత్రి వద్దనే మాటలు రావుగా?

## తప్పుడు తూకాలతో ఆరంభం...

నెల్లూరు ఎసి కూరగాయ మార్కెట్‌లో 70 లక్షలు వెచ్చించి కొత్తగా కట్టిన అంగళ్లను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన కాస్త ఉద్వేగంగా మాట్లాడుతూ ఎసి మార్కెట్‌లోని వ్యాపారులు తమ కుటుంబ ఆత్మ బంధువులుగా అభివర్ణించారు. దీనికి ప్రతిగా ఇక్కడి వ్యాపారులు ఎసి కూరగాయల మార్కెట్ సంఘం గౌరవాధ్యక్షునిగా వివేకానందరెడ్డిని పెట్టుకొంటున్నట్లు ప్రకటించారు. కొత్తగా ప్రారంభించిన 16 కూరగాయల అంగళ్లలో ఒక్కదానిలోనూ ఎలక్ట్రానిక్ తక్కెడలు ఏర్పాటు చేయలేదు. బాధ్యతాయుతమైన ప్రజాప్రతినిధిగా వ్యాపారులకు వాటిని ఏర్పాటు చేసుకోమని జనాన్ని మోసం చేయవద్దని వివేకానందరెడ్డి చెప్పలేదు. పైగా తప్పుడు తూకాల కూరగాయల వ్యాపారానికి రిబ్బన్ కత్తిరించి, ఇక్కడి వ్యాపారుల సంఘానికి గౌరవాధ్యక్షుడిగా కూడా వుంటానని ఒప్పుకొని మరీ వచ్చారు. ఇటువంటి పరిస్థితులలో ఎప్పటికి ఎసి మార్కెట్‌లోని వ్యాపారులు ఎలక్ట్రానిక్ తక్కెడలు పెడతారు?జనానికి ఖచ్చితమైన తూకానికి కూరగాయలిస్తారన్నది శేష ప్రశ్నే.



## ఫోటోలు లేకపోవడానికి కారకులెవరు?

జిల్లాలో 20,60,522 మంది ఓటర్లుగా నమోదై వుంటే ఓటర్ల జాబితాల్లో మాత్రం 3,45,241 మందికి ఫోటోలు లేవు. దీనివల్ల దొంగ ఓట్లు వేయడమనే ప్రహసనం కొనసాగిపోతూనే వుంది. 50వేల మంది వరకు ఫోటోలు తీయించుకోని, ఇవ్వని ఓటర్లు జిల్లాలో వుండొచ్చు. జనం ఫోటోలకు దిగుతున్నా, విడిగా పాస్‌పోర్టు ఫోటోలు రెవిన్యూ యంత్రాంగానికి ఇస్తున్నా అంతిమంగా విడుదల చేస్తున్న జాబితాలు ఫోటోలు లేకుండా బయటకు వస్తున్నాయి. కుంటి సాకులు చెప్పకుండా ఈ సారైనా రెవిన్యూ యంత్రాంగం చిత్తశుద్ధితో ప్రయత్నం చేస్తే ఫోటోలతో కూడిన ఓటరు జాబితా తయారవుతుంది.

## అందుబాటులో టిడిపి ఎమ్మెల్యేలు

జిల్లాలోని తెలుగుదేశం ఎమ్మెల్యేలు వారానికొకరు చొప్పున నెల్లూరు మినీ బైపాస్ రోడ్డులోని పార్టీ కార్యాలయంలో ప్రజలకు అందుబాటులో వుండాలన్న అభిప్రాయానికి వచ్చారు. ప్రతి సోమవారం ఉదయం పది గంటల నుంచి పార్టీకి చెందిన నలుగురు ఎమ్మెల్యేలలో ఎవరో ఒకరు అందుబాటులో వుండి ప్రజల సమస్యలు వింటారు. వాటికి పరిష్కారాలు కనుగొనేందుకు ప్రయత్నిస్తారు.

## ట్రాఫిక్ పోలీసులకు ఎస్పీ చేసిన మేలు!

ట్రాఫిక్ పోలీసులు అదరగొట్టే ఎండల్లో డ్యూటీ చేయడం ఆషామాషీ వ్యవహారం కాదు. వారికి ఉపశమనంగా ఎస్పీ దామోదర్ చొరవ తీసుకొని నల్ల కళ్లద్దాల జోడును దాతల నుంచి సేకరించి 29వ తేది పంపిణీ చేశారు. దుమ్ముధూళి నుంచి రక్షణకు మాస్క్‌లను, వర్షంలో తడవకుండా రేడియం జాకెట్లను అందించారు. డ్యూటీలో ఉన్నప్పుడు ఉన్నతాధికారులు ఎదురొచ్చినా కళ్లద్దాలు తీయకుండానే సెల్యూట్ చేయవచ్చని సలహా యిచ్చారు. ఎస్పీ తీసుకొన్న నిర్ణయానికి ట్రాఫిక్ పోలీసుల్లో ఆనందం వెల్లి విరుస్తుంది.

## వాళ్లు పలకరించుకోలేదు!

ఆనం ఇంట జరిగిన పెళ్లికి సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి మన స్పర్ధలు ప్రక్కన పెట్టి వెళ్లిన విషయం రాజకీయంగా పెద్ద చర్చనీయాంశమయ్యింది. ఈ పెళ్లిలో ఆయన్ను మంత్రి రామనారాయణరెడ్డి పలకరించినా రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాత్రం ముఖం ప్రక్కకు తిప్పుకొన్నారు. మే 30వ తేది నగరంలో జరిగిన మరో పెళ్లిలోనూ వీరిద్దరు ఎదురుపడినా ఎడమొఖం పెడముఖంగా వుండడం వార్తలలోని అంశమయ్యింది.

## వివేకా వినయం!

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఎప్పుడు ఎవరిని తిడతారో ఎవరి పట్ల అతి వినయం ప్రదర్శిస్తారో తెలుసుకోవడం కష్టం. 30వ తేది నెల్లూరు నగర శివార్లలో జరిగిన ఓ పెళ్లికి విచ్చేసిన వివేకా టిఫిన్ తింటుండగా కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి వచ్చిందన్న సమాచారం అందింది. వెంటనే ఆయన టిఫిన్ అక్కడ పారేసి చేతులు కూడ కడగక కాగితంతో తుడుచుకొని ఆమె ముందు ప్రత్యక్షమై 'అమ్మగారు బాగున్నారా' తరహాలో వినయంగా నమస్కరించారు. ఆమె కుర్చీలో కూర్చోగా వివేకా మాత్రం నిలబడే సమాధానాలు చెబుతుండడం చూసేవారిని కాసింత ఆశ్చర్యపర్చింది.

### చందాదారులకు మనవి

- ☞ చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- ☞ 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి రూపంలో మాత్రమే పంపగలరు. చెక్కులు స్వీకరించబడవు.
- ☞ మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరు తున్నాము.

జీవిత చందా రూ.1000/-

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## తెలంగాణ నేతలకు జడ్పీ ఛైర్మన్ విందు!

ఆనం ఇంట జరిగిన పెళ్లికి విచ్చేసిన తెలంగాణ నేతలు మాజీ హోం మంత్రి కె.జానారెడ్డి, నల్గొండ పార్లమెంట్ సభ్యుడు గుత్తా సుఖేందర్‌రెడ్డి, తెలంగాణ కాంగ్రెస్ ఎమ్మెల్యేల ఫోరం నాయకుడు, వరంగల్ ఎమ్మెల్యే బసవరాజు సారయ్యలకు నెల్లూరు వంటకాలతో మధ్యాహ్నం తన స్వగృహంలో జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి షడ్రసోపేతమైన విందునివ్వడం చర్చనీయాంశమయ్యింది.



నెల్లూరులోని జైన్‌గోల్డ్ షోరూంలో వారం వారం నిర్వహిస్తున్న లక్కీ డ్రాలో విజేతకు టీవీఎస్ స్కూటీ తాళాలను అందజేస్తున్న కోవూరు సిఐ రాంబాబు. ప్రక్కన షోరూం ఛైర్మన్ మణిలాల్ జైన్.

## సిపిఎంది దోపిడీయిజం!

సిపిఎం పార్టీ తన సిద్ధాంతమైన, సోషలిజాన్ని వదిలేసి దోపిడీయిజం బాటన నడుస్తున్నాదని రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి విమర్శించారు. ఆనం సోదరుల రౌడీయిజం చెల్లదని ఎసి కూరగాయల మార్కెట్ వద్ద సిపిఎం ఎమ్మీ మధు ఆదివారం చేసిన వాఖ్యలకు ప్రతిగా వివేకా 1వ తేది ఈవిధంగా ప్రతిస్పందించారు. కార్మిక సంఘాల పేరిట పేదల నుంచి వసూళ్లు, రౌడీయిజం, హత్యా రాజకీయాలు ఇవే సిపిఎం సిద్ధాంతాలని వివేకా తనదైన శైలిలో ఘాటుగా మాట్లాడారు.

## వెంకటేశ్వరపురంలో అతిసారం

నెల్లూరు వెంకటేశ్వరపురంలోని గాంధీ గిరిజన సంఘం, ఇస్లాంపేట, జనార్దన్‌రెడ్డి కాలనీ వాసులు వంద మందికి పైగా అతిసార వ్యాధితో బాధపడుతూ నగరంలోని వివిధ ఆసుపత్రులలో చేరారు. ప్రక్కనే పెన్నానది వున్నా సురక్షిత మంచి నీటిని నెల్లూరు కార్పొరేషన్ వెంకటేశ్వరపురం వాసులకు సరఫరా చేయలేకపోతుంది.

## నృసింహునికి మంచి రాబడి!

పెంచలకోనలోని నృసింహుని బ్రహ్మోత్సవాలను పురస్కరించుకొని ఏర్పాటుచేసిన తాత్కాలిక హుండీల్లోనే భక్తులు 12 లక్షల 55వేల 663 రూపాయలు కానుకలు వేశారు. ఇంతమేర గతంలో ఎన్నడూ హుండీ ఆదాయం రాలేదు. పాలకవర్గం లేకపోయినా ఉత్సవాలను ఏ లోటు లేకుండా జరిపిన కార్యనిర్వహణాధికారి శనగవరం శ్రీనివాసమూర్తి అభినందనీయుడు.

## హాస్పిటల్లు రిజిస్ట్రేషన్ చేయించాలి

జిల్లాలో ప్రయివేటు యాజమాన్యాలు నిర్వహిస్తున్న హాస్పిటళ్లు, క్లినిక్కులు, నర్సింగ్‌హోమ్‌లు, డయాగ్నటిక్, ఫిజియోథెరపీ సెంటర్లు, క్లినిక్స్‌ను విధిగా రిజిస్ట్రేషన్ చేయించుకోవాలని అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య పేర్కొన్నారు. 29వ తేది జాయింట్ కలెక్టర్ చాంబర్‌లో మెడికల్ అసోసియేషన్ మెంబర్లతో జరిగిన ప్రత్యేక సమావేశంలో మాట్లాడుతూ జిల్లాలో ఇటువంటి 392 సంస్థలు రిజిస్ట్రేషన్లు చేయించుకోకపోవడం పట్ల అసంతృప్తిని వ్యక్తం చేశారు. కేవలం 64 సంస్థలు మాత్రమే రిజిస్ట్రేషన్ చేయించుకొని వున్నట్లు చెప్పుకొచ్చారు.

## కొంపముంచిన ఒక్క మార్కు

పదవ తరగతి పరీక్షల్లో పలువురు విద్యార్థులు ఒక్కమార్కుతో ఫెయిలయ్యారు. అధికంగా తెలుగు, ఇంగ్లీష్, మ్యాథ్స్ సబ్జెక్టులలో 34 మార్కులు తెచ్చుకోవడంతో వారందరూ పరీక్ష తప్పాల్సి వచ్చింది. మిగతా విద్యార్థుల్లాగా తాము ఇంటర్‌లో చేరాలని ఉత్సాహపడ్డ వీరికి ఒక్క మార్కు శరాఘాతం అయ్యింది. ఇన్‌స్టెంట్ పరీక్షల్లో అయినా తిరిగి మంచి మార్కులు తెచ్చుకొని గట్టున పడాలని పలువురు విద్యార్థులు ప్రయత్నాలు ఆరంభించారు. మూల్యాంకనంలో ఉపాధ్యాయులు నిర్లక్ష్యంగా మార్కులు వేయడం వల్లనే ఈ దుర్గతి సంప్రాప్తించిందని పలువురు ఆరోపిస్తున్నారు. ఏది ఏమైనా ఒక్క మార్కు విద్యార్థుల పాలిట శాపంగా పరిణమించింది.

కొరవ 14వ పేజీలో

## ఎన్టీఆర్ ప్రేతాత్మ అయ్యారా?


ఆనం సోదరుల దిగజారుడు విమర్శలు.

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నోటికి హద్దు పద్దు వుండదు. ఆయన గల్లీ నాయకుల నుంచి ఢిల్లీ నాయకుల వరకు హద్దులు దాటేసి విమర్శింస్తుంటారు. 30వ తేది ఎసి సెంటర్‌లో ఆయన సోదరుడు పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డితో కలసి ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆంధ్రుల ఆరాధ్య నటుడు, విశ్వవిఖ్యాత నటసార్వభౌమ, నటరత్న నందమూరి తారక రామా రావుపై విమర్శలు ఎక్కుపెట్టి అందరినీ ఆశ్చర్యపరచారు. చంద్ర బాబు నాయుడు, ఆయన కుమారులు హరికృష్ణ, బాలకృష్ణలకు ఎన్టీఆర్ జయంతి నిర్వహించే హక్కు లేదు. తెలుగుదేశం పార్టీ మీటింగుల్లో ఎన్టీ ఆర్ ఫోటో పెడుతున్నారు. ఎన్టీఆర్ ప్రేతాత్మ అయ్యారు. వాళ్లు ఆయన ఫోటో పెట్టుకొన్నన్నినాళ్లు ఆయన వారిని ఎన్నికల్లో గెలవనీయడని ఎద్దేవా చేశారు. వైఎస్ పథకాలు అమలు పర్చకపోతే ప్రజలు కాంగ్రెస్ పార్టీ తోలు తీయడం దేవుడెరుగు... ఇప్పటికి రాష్ట్ర ప్రజలు రెండు సార్లు చంద్రబాబునాయుడు తోలు వలచిన సంగతి ఆయన మరచి పోయినట్లున్నారు. ఆరేళ్ల విరామం పది ప్లాపుల తర్వాత 'సింహా' చిత్రం అంతంతమాత్రంగా ఆడుతుంటే బాలకృష్ణ ఏదేదో మాట్లాడేస్తున్నాడు. ఆయనకు రాజకీయ అవగాహన లేదు. రెండు నెలల్లో ఎన్నికలొస్తా యని బాలకృష్ణ నృసింహ క్షేత్రాల పర్యటన సందర్భంగా చెప్పారు. ఆయన ఏమైనా కార్పొరేషన్ ఎన్నికల్లో కార్పొరేటర్‌గా లేకుంటే జిల్లా పరిషత్ ఎన్నికల్లో జడ్పీటీసిగా పోటీ చేస్తారా అని వివేకా వెటకారంగా ప్రశ్నించారు. అసలు నందమూరి వారసుల్లో ఒకరంటే మరొకరికి పడ డం లేదని, జూనియర్ ఎన్టీఆర్‌కు పోటీగా బాలకృష్ణ ఆయన కుమా రుడు మోక్షజ్ఞను హీరోను చేస్తున్నాడన్నాడు. రాజ్యసభ ఎన్నికల్లో పిఆర్పీ మద్దతు కోరనే సోనియాగాంధీ చిరంజీవిని ఢిల్లీ పిలిపించి మాట్లాడా రని పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పుకొచ్చారు.

అయినా ఎన్టీఆర్ పెట్టిన రాజకీయ బిక్షతో వెలుగులోకి వచ్చిన ఆనం కుటుంబం ఆయన ప్రేతాత్మ అయ్యారని విమర్శించడాన్ని అటు నందమూరి కుటుంబ అభిమానులతోపాటు, సామాన్యజనం కూడా జీర్ణించుకోలేక పోతున్నారు.


ఎండల మూలంగా నిర్మానుష్యంగా కెవిఆర్ పెట్రోల్ బంకు సెంటర్.

## రికార్డు బద్దలు చేసిన ఎండలు!

గడచిన మే నెలలో జిల్లాలో ఇప్పటివరకు లేనంతగా ఉష్ణోగ్ర తలు నమోదయ్యి పాత రికార్డులు బద్దలు చేసి పారేశాయి. ఈ ఎం డలకు జనం అల్లాడిపోతున్నారు. విచిత్రంగా ఈ ఎండల్లోనూ పెళ్లి ళ్లకు మంచి ముహూర్తాలు ఉండడంతో ప్రతి కుటుంబీకులు బయ టకు తప్పనిసరిగా రావాల్సిన పరిస్థితి. మే నెల మొదటివారం నుంచే ఎండలు అదరగొట్టేస్తున్నాయి. ఈ నెల మొదటివారం 39 డిగ్రీలుగా మొదలైన ఎండ రెండవ వారానికి 40 డిగ్రీలు దాటేసింది. 11వ తేది ఈ నెలలో అత్యధికంగా 42.2డిగ్రీల ఎండ నమోదయ్యింది. లైలా తుఫాను ప్రభావం మూలంగా 17, 18, 19 తేదీల్లో మాత్రం ఎండ కాసింత తగ్గినట్లు కనపడినా 20వ తేది నుంచి మళ్లీ గ్రీష్ముడు తన

### అల్లాడుతున్న జనం

ప్రతాపం చూపాడు. 25వ తేది నుంచి రోహిణి కార్తె రావడంతో మే నెల చివరి వారంలో ఏ రోజు కూడా ఎండ 42 డిగ్రీలకు తగ్గలేదు. ఉదయం ఎనిమిది గంటల నుంచే చురచురలాడుతున్న ఎండ ప్రభా వం సూర్యాస్తమయం వరకు ఏమాత్రం తగ్గడం లేదు. ఆతర్వాత గాలి ఆడని పరిస్థితి. ఉబ్బతో అన్ని వయసులవారు ఉక్కిరి బిక్కిరైపోతు న్నారు. వేడి గాలుల మధ్య రాత్రి వేళల్లో కంటి నిండా కునుకు తీయ లేని పరిస్థితి. ఫ్యాన్లు, కూలర్లు వేసుకొన్నా చమటలో తడసి ముద్దవు తున్నారు. ఈ ఎండల్లో తిరగకపోవడమే ఉత్తమమని డాక్టర్లు సలహా చెబుతున్నా జనావసరాలు వీధుల్లోకి వచ్చేట్లు చేస్తున్నాయి. రుతుపవ నాలను త్వరగా రాష్ట్రంపై వచ్చేటట్లు చేయమని భగవంతుని ప్రార్థించ డం మినహా జనానికి మరో దిక్కు లేకుండా పోయింది. అదరగొడు తున్న ఎండల నేపథ్యంలోనైనా పర్యావరణ పరిరక్షణకు జనం నేను సైతం అంటూ ముందుకు రాకుంటే భవిష్యత్తులో మరిన్ని తిప్పలు తప్పేట్లు లేవు.

## బడుగులపై కనికరం చూపాల్సిందే!

### రోడ్డు మార్జిన్ వ్యాపారుల దీన జీవనం


ఎసి మార్కెట్ వద్ద రోడ్డు ప్రక్కన కూరగాయలను అమ్ముకొనే వారి నుద్దేశించి మాట్లాడుతున్న రాజ్యసభ సభ్యుడు మధు.

నెల్లూరులోని ట్రంకురోడ్డు, స్టోన్‌హౌస్‌పేట, చిన్నబజారు, పెద్ద బజారు ప్రాంతాలతో పోల్చుకొంటే మద్రాస్ బస్టాండ్ వద్ద ట్రాఫిక్ చేసిన గందరగోళం కాస్త తక్కువే. కానీ నగరంలోని ట్రాఫిక్‌లో చేసిన మార్పుచేర్పుల్లో భాగంగా ఎస్పీ దామోదర్ మరో మాటకు తావులే కుండా వైఎంసి గ్రౌండ్ గోడనానుకొని ఎసి మార్కెట్ వరకు మార్జి న్‌లో వుండిన తాజా కూరగాయలు, ఆకుకూరలు, పండ్లు బుట్టల్లో పెట్టుకొని అమ్ముకునే సామాన్యులను అక్కడ నుంచి ఈడ్చి పడేశారు. ఇక్కడ మళ్లీ బుట్టలు పెట్టుకొని వ్యాపారం చేయకుండా పక్షం రోజుల పాటు ప్రత్యేక పోలీసు దళాన్ని కాపలా పెట్టడంతో కూరగాయలు అమ్ముకొని జీవించే వందలాది కుటుంబాలు గత రెండు నెలలుగా ధైన్యంగా బతకాల్సిన పరిస్థితి దాపురించింది. సిపిఎం పార్టీలో రెబల్ నాయకులు కరువవ్వడంతో ఇక్కడి చిరు వ్యాపారులు ఈ ఎండల్లో చేసిన నిరసనను పట్టించుకొనే అధికారులే కరువయ్యారు. ఈ దశలో 30వ తేది నెల్లూరు వచ్చిన సిపిఎం రాజ్యసభ సభ్యుడు పెనుబల్లి మధు మంచి ఎండలో మార్కెట్ దగ్గర ఈ చిరు వ్యాపారులతో అక్కడే ఓ చిన్న సమావేశం జరిపారు. పనిలేని వారికి పని కల్పించాల్సిన కలె క్టర్ ఏ రోజు కారోజు కూరగాయలు అమ్ముకునే వారి పొట్టలు కొట్ట డం ఏమిటని ప్రశ్నించారు. కలెక్టర్‌తోపాటు ఎస్పీపై ఘాటైన విమ ర్శలు చేసిన మధు ఆనం బ్రదర్స్‌ను వదలలేదు. వారి రౌడీ రాజకీ యాలు ఇక చెల్లవని చరమగీతం పాడే రోజులు దగ్గరపడ్డాయని విమర్శించారు. మార్కెట్ ప్రక్కన వున్న కోనేరు స్థలంలోనైనా ఈ నెల 10వ తేది లోగా బుట్టల్లో కూరగాయలను అమ్ముకోనీయకుంటే ఆమ రణ దీక్షలు తప్పవన్నారు. ఎస్పీ దామోదర్‌ను ఆ పార్టీలో సీనియర్ నేత జక్కా వెంకయ్య సహా వెళ్లి మధు మాట్లాడారు. ఈ వ్యవహారంలో అధికారులు మొండిగా వ్యవహరించే బదులు బడుగులపై కనికరం చూపడం మంచిదేమో!

## ఆనం సేవలో రవాణాధికారులు

### కార్ల హస్తగతం

ఎంకి పెళ్లి సుబ్బి చావుకొచ్చినట్లు చందంగా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి కుమారుడి పెళ్లి నగరవాసులకు కష్టాలు తెచ్చిపెట్టింది. పెళ్లి సందర్భంగా ఆనం బంధువర్గం తిరిగేందుకు సొంత వాహనాలు చాలవన్నట్లు నగరంలో గల అన్ని ట్రావెల్స్ నిర్వాహకుల నుంచి పెద్ద కార్లనన్నింటినీ తీసుకోవడంతో పలు రకాల పనులపై ముందుగా కార్లను బుక్ చేసుకొన్న వారు అవస్థలు పడాల్సి వచ్చింది. వాహ నాలను పెళ్లి పనులకు తరలించేందుకు బ్రేక్ ఇన్స్‌పెక్టర్లు జీ హుజూర్ అంటూ మంత్రి ఆదేశాలకు అనుగుణంగా రోడ్డు పైకి వచ్చి పెట్రోల్ బంకుల వద్ద, వివిధ సెంటర్లలో కాపు కాచి కనిపించిన వాహనాన్ని కన్పించినట్లు ఆనం సేవకు తరలించడంలో రవాణాశాఖ అధికారులు, సిబ్బంది పోటీలు పడ్డారు. కష్టమర్లు ముందుగా వాహనాలను బుక్ చేసుకొ న్నారని వారి వద్ద తమ ట్రావెల్స్ నిర్వాహకులు నెత్తీనోరు బాదుకున్నా బ్రేక్ ఇన్స్‌పెక్టర్లు వినకుండా వాహనాలు స్వాధీనం చేసుకొన్నారు.

## జయంమనదే!

### శిక్షణా శిబిరం ముగింపులో రాజీవ్‌భవన్ నేతలు

రాజీవ్‌భవన్ నేతృత్వంలో నగర కాంగ్రెస్ ప్రాంతీయ శిక్షణా తరగతుల ముగింపు సమావేశం టౌన్‌హాల్‌లో కోలాహలంగా జరిగింది. సభకు అధ్య క్షత వహించిన పిసిసి కార్యదర్శి కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ నగరంలో పోలింగ్ బూత్ స్థాయిలో పటిష్టమైన సుశిక్షుతులైన కాంగ్రెస్ కార్యకర్తల బలగం నిర్మాణం చేసి నిజమైన కార్యకర్తలకు గుర్తింపు తెచ్చేందుకు రాజీవ్‌భవన్ గత నెల రోజులుగా నగరం లోని అన్ని డివజన్లలో శిక్షణాతరగతులు విజయవంతంగా నిర్వహించిదన్నారు. వచ్చే కార్పొ రేషన్ ఎన్నికలలో కాంగ్రెస్ విజయబావుటా ఎగు రవేసే దానికి ప్రతి కార్యకర్త కృషి చేయాలని దివంగత నేత రాజశేఖర్‌రెడ్డికి అదే మనం సమ ర్పించే నివాళి అన్నారు. నగర కాంగ్రెస్ ఇన్‌ఛార్జ డాక్టర్ పి.అనిల్‌కుమార్ మాట్లాడుతూ గత ఎన్ని కల్లో తాను ఓడిపోయినప్పటికీ ధైర్యంగా ఆత్మవి శ్వాసంతో ముందుకు సాగుతున్నానంటే దివంగత నేత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఇచ్చిన స్ఫూర్తి, కార్యక ర్తలు అందిస్తున్న సహాయ సహకారాలే కారణమ న్నారు. జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ అనిల్ గత ఎన్నికల్లో ఓడి పోయినప్పటికీ నగరంలో పటిష్టమైన నాయకునిగా ఎదిగాడని చెప్పేందుకు సభకు వచ్చిన జనమే తార్కాణమన్నారు. నగర కాంగ్రెస్ నాయకులు వై.వి.రామిరెడ్డి, యూత్ కాంగ్రెస్ అధ్యక్షులు పి.కోటేశ్వరరెడ్డి, పిసిసి సంయుక్త కార్యదర్శి ఉడతా వెంక ట్రావ్, కెవిఆర్ విజయశేఖర్‌రెడ్డి, మైనార్టీ నాయకులు అక్రం మొహిద్దీన్, రఘురాం ముదిరాజ్, కార్పొరేటర్లు నెల్లూరు మదన్ మోహన్‌రెడ్డి, తాటి వెంకటేశ్వర్లు, వేల్పుల రజని, స్వర్ణా వెంకయ్య, రూప్‌కుమార్ సభలో ప్రసం గించారు. కార్యక్రమం విజయవంతంగా జరగ డంతో రాజీవ్‌భవన్ నిర్వాహకుల్లో ఆనందం వెల్లి విరిసింది.



టౌన్‌హాల్‌లో జరిగిన శిక్షణా శిబిరం ముగింపు సభలో మాట్లాడుతున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

# ప్రతిభ సత్తాచూపింది...విజయం హోరెత్తింది...నమ్మకం మళ్ళీ గెలిచింది...

## భావితరాలకు స్ఫూర్తిగా నిలిచింది రవీంద్రభారతి స్కూల్స్...

**576/600** — B. Sri Lakshmi, HT.No. 1037105051

**578/600** — K. Sharanya, HT.No. 1023106195

**575/600** — SK. Zaid, HT.No. 1017104939

574/600 | 573/600 | 573/600 | 573/600 | 572/600 | 572/600 | 572/600 | 571/600 | 571/600

571/600 | 571/600 | 570/600 | 570/600 | 570/600 | 570/600 | 568/600 | 568/600 | 567/600

567/600 | 566/600 | 566/600 | 566/600 | 566/600 | 566/600 | 565/600 | 565/600 | 565/600

564/600 | 564/600 | 564/600 | 564/600 | 564/600 | 563/600 | 563/600 | 563/600 | 563/600

563/600 | 563/600 | 563/600 | 563/600 | 563/600 | 562/600 | 562/600 | 562/600 | 562/600

561/600 | 561/600 | 561/600 | 561/600 | 561/600 | 561/600 | 561/600 | 561/600 | 561/600 | 560/600 | 560/600

560/600 | 560/600 | 560/600 | 560/600 | 560/600 | 560/600 | 560/600 | 560/600 | 560/600 | 560/600

ఇంకా మరెన్నో...

| మార్కుల విశ్లేషణ | |
|---|---|
| పరీక్షకు హాజరైన విద్యార్థులు | 1476 |
| 570 పైగా మార్కులు సాధించిన విద్యార్థులు | 18 |
| 560 పైగా మార్కులు సాధించిన విద్యార్థులు | 69 |
| 550 పైగా మార్కులు సాధించిన విద్యార్థులు | 365 |
| 500 పైగా మార్కులు సాధించిన విద్యార్థులు | 1137 |

| 100కు 100 మార్కులు సాధించిన విద్యార్థులు | |
|---|---|
| మాథమాటిక్స్ | 356 |
| సైన్స్ | 116 |
| సోషల్ స్టడీస్ | 05 |
| తెలుగు | 03 |

ఇంతటి ఘన విజయానికి
కారకులైన విద్యార్థులకు,
తల్లిదండ్రులకు
మరియు ఉపాధ్యాయులకు
మా హృదయపూర్వక
శుభాభినందనలు

**అడ్మిషన్లు జరుగుచున్నవి నర్సరీ నుండి 10వ తరగతి వరకు**

అత్యాధునిక వసతులతో కూడిన హాస్టల్ సౌకర్యం

drusya

**NELLORE** - Day & Residential School, Ramesh Reddy Nagar, Fathekhanpet.
Tel. : 0861-2334748, 9912347105.

**IIT - Olympiad School**- Main Road, Fathekhanpet. Mbl: 9912347177.

**Ravindra Bharathi School**
New Concept, Old Values.
Andhra Pradesh

RAVINDRA BHARATHI SCHOOLS ▪ Nellore ▪ Hyderabad ▪ Visakhapatnam ▪ Srikakulam ▪ Vizianagaram ▪ Rajahmundry ▪ Kakinada ▪ Eluru ▪ Bhimavaram ▪ Vijayawada ▪ Gudivada ▪ Guntur ▪ Tenali ▪ Ongole ▪ Tirupathi ▪ Chittoor ▪ Kadapa ▪ Proddatur ▪ Kurnool ▪ Nandyala ▪ Ananthapur



నెల్లూరు ఏసి మార్కెట్ వద్ద ఎమ్మెల్యే వివేకానందరెడ్డిని అడ్డుకొంటున్న రోడ్డు మార్జిన్ కూరగాయల వ్యాపారులు.



నెల్లూరు మద్రాస్ బస్టాండ్ వద్ద గల జూబ్లీ హాస్పిటల్‌ను తనిఖీ చేస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.



ట్రాఫిక్ డ్యూటీలో వుండే పోలీసుల కళ్లకు రక్షణగా నల్ల కళ్లద్దాలను పంపిణీ చేస్తున్న ఎస్పీ దామోదర్.



అంతర్జాతీయ పొగాకు వ్యతిరేక దినోత్సవం సందర్భంగా పెద్దలు పొగత్రాగవద్దంటూ నెల్లూరు గాంధీబొమ్మ వద్ద స్కేటింగ్ చేస్తున్న చిన్నారులు.

# వెంకటగిరిలో క్రీడాకారుల ఇబ్బందులు!

క్రీడాకారులు, క్రీడాభిమానులు మెండుగా వున్న వెంకటగిరి పట్టణంలో క్రీడలకు సంబంధించి తగిన వసతులు లేకపోవడం పలువురిని వేదనకు గురి చేస్తున్నది. పాఠశాలలు, కళాశాలల స్థాయిలో పలువురు విద్యార్థినీ విద్యార్థులు వివిధ క్రీడల్లో తమ ప్రతిభను ప్రదర్శిస్తున్నా వారిని ప్రోత్సహించేందుకు అవసరమైన మౌలిక సదుపాయాలు లేకుండా పోయాయి. పేరుకు మైదానాలున్నా తగిన వసతులు కరువవడంతో క్రీడాకారులు శిక్షణపొందేందుకు ఇబ్బందులు పడాల్సివస్తోంది. గతంలో ప్రభుత్వ కళాశాల మైదానంలో క్రికెట్‌పిచ్, టెన్నిస్‌కోర్టు వుండేవి. అందులోనే మినీజిమ్ ఏర్పాటు చేశారు. ఇవన్నీ నేడు కనుమరుగు కావడంతో క్రీడాకారులు తగిన వసతులు లేక ప్రోత్స

## అరకొర వసతులు

హించేవారు లేక నిర్వీర్యం అవుతున్నారు. క్రీడామైదానాల్లో ప్లాట్స్ వేసి అమ్మకానికి పెట్టడం, వసతిగృహాలు నిర్మిస్తుండడంతో క్రీడామైదానాలు అంతర్ధానం అవుతున్నాయి. ఆర్‌పిఎం హైస్కూలు ప్రాంగణంలో షాపింగ్ కాంప్లెక్స్ నిర్మిస్తున్నారు. స్పోర్ట్స్ అథారిటి ఆధ్వర్యంలో స్టేడియం ఏర్పాటైనా పూర్తిస్థాయిలో వసతులు లేవు. తారకరామ క్రీడాప్రాంగణంలో సైతం ఇదే పరిస్థితి. క్రీడాకారులను దృష్టిలో వుంచుకొని వారిని ప్రోత్సహించేందుకు, తగిన శిక్షణకు వసతులను ఏర్పాటు చేయాల్సిందిగా పట్టణ క్రీడాభిమానులు కోరుకొంటున్నారు.

- మురికి కూపంగా

# ముత్తుకూరు!

పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ముత్తుకూరు మండలం పారిశుధ్యపరంగా మాత్రం అత్యంత దయనీయంగా వుంది. మురికినీరు, చెత్తాచెదారాలతో ఎటుచూసినా మురికి కూపంగా మారింది ముత్తుకూరు. పరిశ్రమల ఏర్పాటు వలన జనాభా రెట్టింపు అయ్యింది. దానికి తగినట్లు మౌలిక సదుపాయాలు కల్పించడంలో పంచాయితీ విఫలం కావడంతో ప్రజలు సమస్యలతో సావాసం చేయాల్సి వస్తోంది. ముత్తుకూరు

## ఎటుచూసినా చెత్తాచెదారాలే!

గ్రామంతోపాటు మండలంలోని పలుగ్రామాల్లో పారిశుధ్యం లోపించి వుంది. రోడ్లపై ప్రవహిస్తున్న మురుగునీరు, వీధుల్లో పేరుకొన్న చెత్త కుప్పల కారణంగా దుర్గంధం వెదజల్లుతుండడంతో ఎక్కడ అంటురోగాలు ప్రబలుతాయోనని ప్రజలు హడలిపోతున్నారు. దోమలు విజృంభిస్తుండడంతో ప్రజలకు కంటి మీద కునుకు వుండడం లేదు. దీనికి తోడు ప్లాస్టిక్ కవర్ల వాడకం పెరగడంతో కాలుష్యానికి కారణం అవుతున్నాయి. మరో వైపు వాహన కాలుష్యం కారణంగా మండల ప్రజలు అల్లాడిపోతున్నారు.

## బీటలు వారుతున్న ఇందిరమ్మ ఇళ్లు!

పేదలకు గూడు కల్పించాలన్న ఆశయంతో ప్రభుత్వం చేపట్టిన ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణం కాంట్రాక్టర్‌లకు వరంగా మారింది. నివేశన స్థలాలు మంజూరు నుంచి నిర్మాణాలు పూర్తయ్యేవరకు అడుగడుగునా అక్రమాలు చోటుచేసుకొంటున్నాయి. అత్యంత నాసిరకంగా ఇళ్లను నిర్మిస్తుండడంతో పలు ప్రాంతాల్లో ఇళ్లు బీటలు వారుతున్నాయి. కావలి ప్రాంతంలో ఇలాంటి గృహాలు అధికంగా వున్నాయి. పునాదులు లోతుగా తీయకుండా, సిమెంటురాళ్లతో గోడలు నిర్మించి, నీటితో సరిగా క్యూరింగ్ చేయకుండానే బిల్లులు డ్రా చేస్తుండడంతో ఇళ్ల నిర్మాణం పూర్తయిన కొద్దికాలానికే వాటి నిజస్వరూపం బట్టబయలవుతుంది. గోడలు పగుళ్లు వస్తున్నాయి. వాటిని సిమెంట్‌తో పూడ్చి తాత్కాలికంగా మరమ్మత్తులు చేపట్టినా అవి నిలవడం లేదని ఆ ఇళ్లలో చేరాలంటేనే లబ్దిదారులు భయపడుతున్నారు. కావలి మునిసిపాలిటీ పరిధిలోనూ, బుడమగుంట వద్ద నున్న ఇందిరమ్మ, గ్రీన్ సిటీలోనూ ఇలాంటి పగుళ్లు ఇచ్చిన గృహాలు దర్శనమిస్తున్నాయి.

## విదేశీ పక్షుల విడిది వెన్నవాడ

ఆత్మకూరు మండలంలోని వెన్నవాడ విదేశీ పక్షులకు విడిది కేంద్రంగా మారింది. ప్రతి ఏడాది క్రమం తప్పకుండా ఈ పక్షులు ఇక్కడకు వచ్చి సందడి చేస్తుంటాయి. వర్షాలు కురిసినా కురవకపోయినా ఈ పక్షులు మాత్రం ఈ ప్రాంత ప్రజలను పలకరిస్తాయి. వీటి రాకతో ఈ గ్రామం ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తున్నది. ఆస్ట్రేలియా, సైబీరియాల నుంచి ఈ పక్షులు వస్తాయి. నవంబర్, డిసెంబర్ నెలల నుంచి వీటి రాక మొదలవుతుంది. దాదాపు ఎనిమిది నెలల పాటు గ్రామంలో వుంటాయి. జూన్, జూలై నెలలు వచ్చే సరికి ఎగిరే పిల్లలను తమ వెంట విదేశాలకు తీసుకొని వెళ్తుంటాయి. ఈ పక్షులను గ్రామస్తులు తమ నేస్తాలుగా భావిస్తారు. ప్రతి ఏటా అతిథులుగా వచ్చే ఈ పక్షులకు వేటగాళ్ల వల్ల ఎలాంటి హాని జరగకుండా కంటికి రెప్పలా కాపాడుకొంటారు. ఆహారం కోసం పక్షులు సోమశిల జలాశయం, ఆత్మకూరు, అనంతసాగరం చెరువులు, కనిగిరి రిజర్వాయర్‌పై ఎగురుతూ చేపలను పట్టుకొని తీసుకొచ్చి పిల్లలకు ఆహారంగా అందివ్వడం చూసే వారికి ముచ్చట గొలుపుతుంది. క్రమం తప్పకుండా గత 10 సంవత్సరాలుగా వస్తున్న విదేశీ విహంగాల రాకతో వెన్నవాడ ప్రాంతం ఒక ప్రత్యేకతను సంతరించుకొంది.

# దెబ్బతిన్న ముత్తుకూరు రోడ్లు!

- పట్టించుకోని అధికారులు

ముత్తుకూరు మండలంలో అధ్వాన్నంగా వున్న గ్రామీణ రోడ్లు ప్రయాణీకులకు నరకాన్ని చూపిస్తున్నాయి. దెబ్బతిన్న రోడ్లకు మరమత్తులు చేస్తున్నా అవి స్వల్ప కాలంలోనే తిరిగి యధాస్థితికి చేరుకొంటుండడంతో గుంటలు మిట్టలుగా తయారైన రోడ్లపై వాహనాలు నడిపేవారు అవస్థలు పడుతున్నారు. మండలంలోని డమ్మాయిపాళెం, పోలంరాజు గుంట, పంటపాళెం తదితర ప్రాంతాల్లో చూసినట్లయితే రోడ్లు ఎంత ఘోరంగా వున్నది తెలుస్తుంది. పోర్టు ఏర్పాటు కావడం, క్రొత్త పరిశ్రమల రాకతో నిత్యం వందలాది వాహనాలు తిరుగుతుండడంతో రోడ్లు రోజురోజుకు అధ్వాన్నంగా మారుతున్నాయి. నిర్మాణంలో నాణ్యతాప్రమాణాలు పాటించకపోవడం, మరమ్మత్తులు తూతూ మంత్రంగా జరిపిస్తుండడంతో రోడ్లు నరకలోక లోగిళ్లుగా మారాయి. ఇంతగా రోడ్లు దెబ్బతిన్నా ప్రజాప్రతినిధులు, అధికారులు పట్టించుకోకపోవడంతో వాహనాలలో వెళ్లేవారు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ఈ రోడ్లపై తిరగడం వలన ప్రమాదాలకు గురికావడంతోపాటు వాహనాలు తరచూ మరమ్మత్తులకు గురౌతున్నాయని వాహన యజమానులు వాపోతున్నారు.

# నత్తనడకన డ్రైనేజి పనులు!

గూడూరు పాత బస్టాండ్ సెంటర్ నుండి సంగం థియేటర్ వరకు జరుగుతున్న డ్రైనేజి నిర్మాణ పనులు ఆరు నెలలుగా నత్తనడకన సాగుతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. టవర్‌క్లాక్ సెంటర్ నుంచి సంగం సినిమాహాలు వరకు 2 కోట్ల రూపాయల నిధులతో సిసి రోడ్డు, డ్రైనేజి, పేవ్‌మెంట్ నిర్మాణాలు చేపట్టాల్సి వుండగా పనులు ఆలస్యంగా ప్రారంభం అయ్యాయి. చేపట్టిన పనులన్ని త్వరితగతిన పూర్తవుతాయని అనుకొంటే మధ్యలోనే నిలిపివేశారు. దీంతో ఈ మార్గంలో తిరిగే బస్సులు, భారీ వాహనాలు, ఆటోలు, ద్విచక్రవాహనదారులు తీవ్రంగా ఇబ్బందిపడాల్సి వస్తోంది. రైల్వే అండర్ బ్రిడ్జి ప్రాంతంలో గల అశోక్‌నగర్ ప్రాంతంలోని ధూర్జటినగర్ మీదుగా చల్లకాలువ బ్రిడ్జి వరకు సిసి రోడ్డు నిర్మిస్తున్నారు. ఇవి ఆలస్యంగా జరుగుతుండడంతో ఈ ప్రాంతంలో తిరిగే భారీ వాహనాలు, బస్సులు ప్రస్తుతం డ్రైనేజి

### ఇబ్బందులు పడుతున్న గూడూరు జనం

నిర్మాణపనులు జరుగుతున్న టవర్ క్లాక్‌సెంటర్, ఆస్పత్రిరోడ్డు, సంగం సినిమాహాలు మీదుగా వెళ్తున్నాయి. ఈ రోడ్డును ఒకవైపు కాలువ నిర్మాణం కోసం త్రవ్వేసి వుండడం వల్ల ఒక వైపునే వాహనాల రాకపోకలు సాగించాల్సిన పరిస్థితి నెలకొంది.



పాలిటెక్నిక్ ఎంట్రన్స్‌లో రాష్ట్ర స్థాయిలో 24వ ర్యాంకు, ఎస్వీ యూనివర్సిటీ పరిధిలో మొదటి ర్యాంకును పొందిన నెల్లూరు న్యూనేతాజి టాలెంట్ స్కూల్ విద్యార్థిని భవ్యశ్రీని సత్కరిస్తున్న కరస్పాండెంట్ జడ్.శ్రీనివాసులురెడ్డి. మాజీ ఎంఇఓ నరసయ్య.

● అడంగళ్ల

# కంప్యూటరీకరణ!

### కావలిలో రెవెన్యూ కసరత్తు

కావలి డివిజన్‌లోని రైతులు, వారి పొలాలు, విస్తీర్ణం తదితర వివరాలను కంప్యూటర్‌లో పొందుపరచేందుకు రెవెన్యూ అధికారులు కసరత్తు చేపట్టారు. అడంగళ్లను కంప్యూటీకరించేందుకు 18 మండలాలకు చెందిన అధికారులు, విఆర్‌ఓలు కంప్యూటర్ ఆపరేటర్లతో కలసి క్షుణ్ణంగా చేపడుతున్నారు. ఈ అడంగళ్ల కంప్యూటరీకరణ పూర్తయితే వివిధ సర్టిఫికేట్లకు పలువురు అధికారులపై ఆధారపడాల్సిన అవసరం వుండదు. ఒక అధికారే అన్నిరకాల ధృవీకరణ పత్రాలను ఇచ్చేందుకు వీలవుతుంది. గ్రామాల్లో వున్న రైతులు, వారి స్వాధీనంలో వున్న భూముల వివరాలు, ఆయా పొలాలకు వినియోగిస్తున్న నీటి వివరాలు అన్నీ కంప్యూటర్‌లో పొందుపరచడం వలన ఏ వివరాలు కావాలన్నా వెంటనే తెలిసిపోతాయి. బావులు, బోరుబావులు, ప్రాజెక్టు నీరు, సహజవనరుల ద్వారా వ్యవసాయం చేసే రైతుల వివరాలు నమోదై వుండడంతో నీటి శిస్తు వసూలు సులభతరం అవుతుంది. దీనికోసం ఆయా మండలాలకు చెందిన కంప్యూటర్ ఆపరేటర్‌తో కలసి విఆర్‌ఓలు, మండల రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు ఆర్‌డిఓ కార్యాలయంలో తిష్ట వేసి ఈ కార్యక్రమంలో తలమునకలై వున్నారు.

# పొదలకూరులో ఆటోల జోరు!

పొదలకూరులో ఆటోల జోరు ప్రజలను బెంబేలెత్తిస్తుంది. ట్రాఫిక్ నిబంధనలు పాటించకుండా అధికలోడ్‌తో తిరుగుతున్న ఆటోల వలన అటు ప్రజలు, ఇటు ప్రయాణీకులు పలు అవస్థలు పడుతున్నారు. ఈ కారణంగా తరచూ ప్రమాదాలు సంభవిస్తున్నాయని, ఆటో బోల్తాపడి పలువురు ప్రాణాలమీదకు తెచ్చుకొంటున్నారని స్థానికులు ఫిర్యాదు చేస్తున్నా అధికారులు పట్టించుకోవడం లేదు.

### నిబంధనలు బేఖాతరు!

పొదలకూరులో దాదాపు 200కుపైగా ఆటోలున్నాయి. చుట్టు ప్రక్కల వున్న వంద గ్రామాలకు ఆటోలు రాకపోకలు సాగిస్తున్నాయి. సోమశిల, రాపూరు, సైదాపురం, మనుబోలు రూట్ల మీదుగా తిరిగే ఈ ఆటోలు పరిమితికి మించి ప్రయాణీకులను ఎక్కించుకొంటున్నాయి. కనీస నిబంధనలను పాటించకుండా నిర్లక్ష్యంగా ఆటోలు నడుపుతుండడం వల్ల ట్రాఫిక్ సమస్య ఎదురుకావడంతోపాటు ప్రమాదాలు తప్పడం లేదు.

# రాజాల కొమ్ముకాస్తున్న ట్రాన్స్‌కో!

● సామాన్యులకు దిక్కెవరు?

ప్రజలకు సేవలందించాల్సిన విద్యుత్‌శాఖ ధనవంతులకు, పలుకుబడిగల వాళ్లకు కొమ్ముకాస్తుండడం వెంకటగిరి ప్రాంతంలో విమర్శలపాలవుతోంది. పట్టణంలో రద్దీ ప్రదేశాలలో, కూడళ్లలో ఏర్పాటు చేసి వున్న ట్రాన్స్‌ఫార్మర్ల కారణంగా ఇబ్బందులు ఎదురౌతున్నాయి. ట్రాఫిక్ సమస్యలు ఇతరత్రా సమస్యలు తలెత్తుతుండడంతో వీటిని మార్చాల్సిందిగా స్థానికులు చాలాకాలం నుంచి కోరుతున్నా ఫలితం లేకుండా పోయింది. రాజవీధి, వినాయకుడిగుడి దగ్గర, హైస్కూల్ వెనుక, దక్షిణం వీధిలో ఏర్పాటు చేసి వుండే ట్రాన్స్‌ఫార్మర్లు అతి తక్కువ ఎత్తులో వుండడంతో తరచూ ప్రమాదాలకు గురౌతుండడంతో వీటిని రద్దీలేని ప్రాంతంలో ఏర్పాటు చేయాలని కోరుతున్నా పట్టించుకోని విద్యుత్‌శాఖ అధికారులు, వెంకటగిరి రాజాలు నూతనంగా నిర్మిస్తున్న షాపింగ్ కాంప్లెక్స్‌కు అడ్డుగా వుందని అక్కడ వుండే ట్రాన్స్‌ఫార్మర్‌ని మాత్రం క్షణాల్లో మార్చేందుకు సిద్ధం కావడంతో స్థానికులు అడ్డుకున్నారు. సామాన్యులు చెబితే చెవికెక్కించుకోని విద్యుత్ శాఖ ధనబలం, రాజకీయ అండ కల్గిన వారి విషయంలో మాత్రం దూదూ బసవన్నలుగా వ్యవహరించడం పట్ల ప్రజలు

# పాపం... ఉపాధిహామీ కూలీలు!

● ఎండలకు తల్లడిల్లుతున్నారు

ఉదయగిరి నియోజకవర్గంలో ఉపాధిహామీ పథకం క్రింద పనులు చేస్తున్న కూలీలకు ఆరోగ్య భద్రత కరువైంది. లైలా తుఫాను కారణంగా రెండురోజులు వానలు కురిసినప్పటికి తిరిగి ఎండలు యధాతథంగా వుండడంతో పనులకు వెళ్లిన కూలీలు ఎండ వేడిమికి తాళలేక అస్వస్థతకు గురౌతున్నారు. ఉదయగిరి, సీతారాంపురం, దుత్తలూరు, వరికుంటపాడు, వింజమూరు మండలాల్లో పనులు చేసే కూలీలకు తిప్పలు తప్పడం లేదు. ప్రభుత్వం వివిధ ప్రాంతాల్లో ఉపాధిహామీ క్రింద చేపడు తున్న పనులలో కూలీలకు తగిన రక్షణ చర్యలు తీసుకోవాలని, ప్రాథమిక చికిత్స కోసం తగిన మందులను సిద్ధంగా వుంచాలని, దాహార్తి తీర్చుకొనేం దుకు మంచినీటి వసతి కల్పించాలని నిబంధనలు విధించినప్పటికీ అవెక్కడా అమలుకావడం లేదు. ఎండ తీవ్రతను తట్టుకోలేక కూలీలు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. సౌకర్యాల కల్పనకు అధికారులు నిధులు విడుదల చేస్తున్నప్పటికీ క్షేత్రస్థాయిలో సిబ్బంది వీటిని స్వాహా చేస్తుండడంతో కూలీలు అనారోగ్యానికి గురికావాల్సి వస్తోంది.

## టీవీ ఛానళ్ల 'సిగపట్లు'




సమాజ చైతన్యానికి దోహద పడాల్సిన మీడియా ఇప్పుడు బురద చల్లుకునే కార్యక్రమంలో వుంది. ఎన్ టి.వి, ఎబిఎన్ ఆంధ్రజ్యోతి ఛానెళ్లు ప్రస్తుతం సిగపట్లు పట్టు కుంటున్నాయి. విశాఖపట్నంకు చెందిన ఒక స్వామీజీని ఎన్.టి.వి బ్లాక్‌మెయిల్ చేసిం దంటూ ఎబిఎన్ టీవీ మంగళవారం లైవ్ కార్యక్రమాన్ని ప్రసారం చేసింది. దీనికి ఎన్.టి.వి కూడా 'లైవ్' ప్రోగ్రామ్‌తో ఎదురుదాడికి దిగింది. ఈ రెండు ఛానళ్ల యాజమానులు ఒకే సామాజిక వర్గానికి చెం దిన వాళ్లు కావడం కొసమెరుపు. కాగా ఛానెళ్ల మధ్య అనాగరిక పోటీ ప్రేక్షకులకు శిరో భారంగా మారింది.

## ప్రభుత్వం మొద్దు నిద్ర



రాష్ట్ర రాజకీయం అస్తవ్యస్తంగా వుండటంతో ప్రభుత్వంలో పనులు సరిగ్గా జరగటం లేదు. సచివాలయంలో అధికారులెవరికీ 'పని' మూడ్ లేకుండా పోయింది. ఐఎఎస్‌లంతా పని మీదకంటే రాజకీయాల మీదనే ఆసక్తి చూపుతున్నారు. దీంతో సకాలంలో జరగాల్సిన పనులు జరగడం లేదు. ఫైళ్ల గుట్టలు పెరిగిపోతున్నాయి. రాష్ట్రమంత్రులది కూడా దాదాపు ఇదే పరిస్థితి. ప్రతిరోజు మంత్రులు గ్రూపులుగా కలుసుకోవడం రాజకీయాలపై చర్చించడం మినహా తమ శాఖల పని తీరును పట్టించుకోవడం లేదు. దీనివల్ల ప్రభుత్వ పరంగా జరగాల్సిన అతి ముఖ్య కార్యక్రమాల అమలు మూలబడిపోతుంది. ఈ కుంభకర్ణ నిద్ర వద లాలంటే రాజకీయాలు గాడిన పడాలని రాజకీయ పార్టీలంటున్నాయి. మరి రోశయ్య ఏం చేస్తారో వేచి చూడాల్సిందే.

## జగన్ చుట్టూ గూఢచారులు!



జగన్ చుట్టూ గూఢచారులు ఎక్కువయ్యారు. వరంగల్ జిల్లా ఓదార్పు యాత్ర వివాదం తర్వాత జగన్ ఢిల్లీ వెళ్లి వచ్చాడు. తిరిగి వచ్చిన దగ్గరనుంచే రాష్ట్ర, కేంద్ర ఇంటిలిజెన్స్ వర్గాలు జగన్‌పై వేయికళ్లు వేసి వుంచాయి. జగన్‌ను రోజూ ఎవరెవరు కలుస్తున్నారు! జగన్ వ్యూహం ఏమిటి? అన్న విషయమై నిఘాసంస్థలు ఆరా తీస్తు న్నాయి. ఈ విషయం తెలిసిన మంత్రులు, ఎమ్మెల్యేలు మొఖం చాటేస్తు న్నారు. జగన్ స్వయంగా పిలిచినా కూడా వస్తామంటూనే దాటేస్తున్న వారి సంఖ్య రోజు రోజుకూ ఎక్కువ అవుతోందట. కొత్తగా మంత్రి పదవుల్ని ఆశిస్తున్నవారు జగన్ ఫోన్‌కు కూడా అందుబాటులో లేక తప్పించుకొని తిరుగుతున్నారు. ఎవరి బాధ వారిది! ఏంచేస్తాం!!

## మార్కెటింగ్ మాయ



లీజుకు తీసుకున్న భూముల్ని సదరు లీజుదారులు బ్యాంకుల్లో 'తనఖా' పెట్టుకొని రుణాలు తీసుకోవచ్చా! రాష్ట్ర వ్యవ సాయ మార్కెటింగ్ శాఖ మాత్రం ఈ సువర్ణావకాశాన్ని కల్పి స్తోంది. వ్యవసాయ మార్కెట్ కమిటీ భూముల్ని కోల్డ్‌స్టోరేజ్‌లకు, పెట్రోల్ బంకులకు, ప్రైవేటు గోదాములకు నామమాత్రపు లీజుకు ఇస్తోంది మార్కెటింగ్ శాఖ. లీజుకు తీసుకున్నవారు తమ లీజు భూముల్ని బ్యాంకుల్లో 'తనఖా' పెట్టుకుంటామని, అందుకు అంగీకరించాలని కోరడం... వెంటనే ఆ శాఖాధి కారులు ఆగ మేఘాల మీద అనుమతించడం జరిగిపోతోంది. హైదరాబాదు నగరం మధ్యలో గడ్డి అన్నారం పండ్ల మార్కెట్‌లో, ఎల్‌బి.నగర్ కూరగాయల మార్కెట్‌లో కోల్డ్ స్టోరేజ్‌లకు లీజు కిచ్చిన భూములకు సదరు లీజుదార్లకు 'తనఖా' హక్కుల్ని 'భుక్తం' చేశారు. గడ్డి అన్నారం కోల్డ్‌స్టోరేజ్ యజమాని ఇప్పటికే కమిటీ భూమిని తనఖా పెట్టి లక్షలాది రూపాయల రుణం పట్టేశాడు. ఈ రుణ పథకం బాగుంది కదా!

## రాజకీయ లెక్కలు షురూ!



ఓదార్పు యాత్రపై జగన్ మొండి పట్టు, అధిష్టానం కన్నెర్ర నేపథ్యంలో రాజకీయ పార్టీలన్నీ ఇప్పుడు ఎమ్మెల్యేల లెక్కల్లో తలమునకలై వున్నాయి. జగన్ గనక ఒక వేళ పార్టీని ధిక్కరించి బయటకువస్తే ప్రభుత్వానికి ఇబ్బంది ఏమైనా వుంటుందా? అసలు జగన్‌తోపాటు బయటకు వచ్చేవాళ్లు ఎంతమంది వుంటారన్న విషయంలో రాజధానిలో జోరుగా అంచనాలు వేస్తున్నారు. ఈ విషయంలో తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబు మరో అడుగు ముందుకేసి జగన్ వెంట నడిచే ఎమ్మెల్యేల జాబితాను తయారుచేస్తున్నారు. ప్రభుత్వానికి 'ఇబ్బంది' కలిగించేంత శక్తి జగన్‌కు వుందా? లేదా? అన్న విషయమై చంద్రబాబు తన అనుచరులతో సుదీర్ఘ మంతనాలు జరుపుతున్నాడు. త్వరలో మధ్యంతర ఎన్నికలు వస్తాయని 'బాబు' ఇటీవల మహానాడులో చెప్పడం వెనుక ఆయన అంచనాలు ఆయనకున్నాయంటున్నారు. చక్రం తిప్పడానికి 'బాబు' తొందరపడుతున్నాడా! ఏమో!!



## ఏకాకి జగన్

వైఎస్ జగమంత కుటుంబమైతే, ఆయన కుమారుడు జగన్‌ది మాత్రం ఏకాకి జీవితం అయింది. ఓదార్పు యాత్రపేరుతో పశ్చిమ గోదావరి, ఖమ్మం జిల్లాల్లో పర్యటించినపుడు కాంగ్రెస్ పార్టీ మం త్రులు, ఎమ్మెల్యేలు, ఎంపీలు ఆయన వెంటే వున్నారు. దీంతో జనంలోనే కాదు కాంగ్రెస్ ప్రజాప్రతినిధుల్లో కూడా జగన్‌కు మంచి ఫోలోయింగ్ వుందనుకున్నారు. ఇదంతా జరిగి నెలరోజులు గడవకముందే కథ అడ్డం తిరి గింది. వరంగల్ జిల్లా ఓదార్పు పర్యటన కాస్తా తలకిందులై వివాదంలో చిక్కుకోవడంతో జగ న్‌కు కష్టాలు మొదలయ్యాయి. నిన్న మొన్నటి దాకా జగన్ ఇంటి గడప తొక్కిన వారంతా యిప్పుడు మొఖం చాటేస్తున్నారు. చివరకు వై.ఎస్ వర్గీయులైన రాష్ట్రమంత్రులు కూడా ప్రత్యేకంగా విలేకరుల సమావేశం పెట్టి మరీ జగన్‌పై ఎదురుదాడి చేశారు. ఇప్పుడు జగన్ ఏకాకి అన్న సందేశాన్ని ఇచ్చారు. ప్చ్! రాజకీ యామా? మజాకా?

## స్థానిక ఎన్నికల గండం



స్థానిక ఎన్నికలు కాంగ్రెస్‌పార్టీకి గండంగా మారనున్నాయా? అవుననే అంటున్నాయి గాంధీభవన్ వర్గాలు. ఎన్నికలు ముంచుకొస్తున్న తరుణంలో కాంగ్రెస్‌లో కీచులాటలు ఎక్కువయ్యాయి. జగన్ వర్గం స్వరం పెంచి రోశయ్యపై ఎదురుదాడికి దిగింది. వైఎస్ పథకాల్ని రోశయ్య నీరుకారుస్తున్నాడంటూ ప్రచారం ఎక్కువ చేయ డంతో జనంలో ప్రభుత్వ ప్రతిష్ట రోజురోజుకూ దిగ జారిపోతోంది. దీంతో స్థానిక ఎన్నికల్లో కాంగ్రెస్‌కు గడ్డు పరిస్థితి ఎదురుకాక తప్పదని గాంధీభవన్ వర్గాలు ఇప్పటికే అధిష్టానానికి నివేదిక పంపాయి. స్థానిక ఎన్నికల్లో గనక మంచి ఫలితాలు వస్తే అవన్నీ రోశయ్యకు అనుకూలంగా మారుతుందని జగన్ వర్గం భావిస్తోంది. అందుకే ఎన్నికల ముందు నుంచే రోశయ్య ప్రభుత్వంపై వ్యతిరేక ప్రచారం ముమ్మరం చేసి ప్రభుత్వ 'ఇమేజ్'ను దెబ్బతీయటానికి జగన్ వర్గం కంకణం కట్టుకుందని అధిష్టానానికి పంపిన నివేదికలో పేర్కొన్నారట. చూద్దాం... ఏం జరుగుతుందో!!




నెల్లూరు జిల్లా రచయితల సంఘం, ఎపియూడబ్ల్యుజె సంయుక్తంగా జిల్లాలోని జర్నలిస్టులకు నిర్వహించిన కవితల పోటీలో విజేత జమీన్‌రైతు సహాయ సంపాదకుడు అల్లూరు రహీంకు బహుమతినందిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, డాక్టర్ శ్రీనివాస తేజ.

## హోటళ్లు ఖాళీ చేయించారు!




పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి తనయుని పెళ్లి ఈవారంలో సింహపురిలో అంగరంగ వైభవంగా జరిగింది. ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, రాష్ట్ర మంత్రులు, వివిధ పార్టీల నాయకులు, ఎమ్మెల్యేలు, ఐఎఎస్, ఐపిఎస్ అధికారులంతా తరలివచ్చారు. వీరికి నగరంలో బస ఏర్పాటు చేయను అధికారులకు తలకు మించిన భారమయ్యింది. దీన్ని అధిగమించను వీళ్లు తమ అధికారబలాన్ని ప్రయోగించారు. నగరంలోని హోటళ్లలో మే 27, 28 తేదీల్లో రూములు బుక్ చేసుకొని వున్నవారిని, అప్పటికే రూముల్లో దిగిన వారిని బలవంతంగా ఖాళీ చేయించారు. మంత్రి తనయుని వివాహం జరిగిన రోజే నగరంలో చాలా పెళ్లిళ్లు జరిగాయి. ఈ పెళ్లిళ్లకు వచ్చినవారు మరో గత్యంతరం లేక నానాపాట్లు పడవలసి వచ్చింది. అయినా మంత్రి ఇంట్లో పెళ్లంటే మజాకానా?

## మాట తప్పారు!




జిల్లాలోని ట్రాన్స్‌కో అధికారులు ఎడాపెడా విద్యుత్ కోతలు విధిస్తుంటారు. ఇదేమిటని ఎవరైనా ప్రశ్నిస్తే ఓవరులోడు ఏమి చేయలేమని నిర్లక్ష్యంగా సమాధానమిస్తారు. అటువంటి అధికారులు లైలా తుఫాను తర్వాత జిల్లాలో ప్రస్తుతం విధిస్తున్న విద్యుత్ కోతలు ఎత్తివేస్తున్నట్లు ప్రకటించారు. కాని చెప్పిన మాట మీద వారం కూడా నిలబడలేదు. మే 26వతేది నుంచి యధాతథంగా నగరాల్లో రోజుకు రెండుగంటలు, పట్టణాల్లో, పల్లెల్లో నాలుగు గంటలపాటు విధిస్తున్న కోతకు జనం అల్లాడిపోతున్నారు. మొత్తం మీద మాట మీద నిలబడని ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్‌ను జనం ఉత్తరకుమారుడని శాపనార్థాలు పెడుతున్నారు.

## ఛాన్స్ కొట్టిన నెల్లూరు నవాబు!



నెల్లూరు నగరంలో లక్షలాది మంది మైనారిటీలున్నా రాజకీయంగా వారికి అవకాశాలు లభించింది చాలా తక్కువే. కాని నెల్లూరు అనితహాల్ ప్రక్కింటి నుంచి హైదరాబాద్‌కు వెళ్లి స్థిరపడిన జాఫర్ హుస్సేన్ మాత్రం నక్కతోక తొక్కారనాలి. జాఫర్ హుస్సేన్ హైదరాబాద్‌లో ఎంఐఎం పార్టీలో చేరి క్రియాశీలక నాయకునిగా మారారు. అసదుద్దీన్ ఓవైసీ సోదరుల అభిమానం కూడా పొందడంతో ప్రస్తుతం ఆయన గ్రేటర్ హైదరాబాద్‌కు డిప్యూటి మేయర్‌గా వ్యవహరిస్తున్నారు. ఈవారం స్వంత పట్టణానికి విచ్చేసిన జాఫర్ హుస్సేన్‌ను నెల్లూరు మేయర్‌తోపాటు పలువురు మైనార్టీ ప్రముఖులు సత్కరించి మంచి బిర్యానీతో విందు చేశారు. ఎంత ఎదిగినా ఒదిగి వుండాలనే లక్షణం జాఫర్‌హుస్సేన్‌లో కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. అదే ఇతని ఎదుగుదలకు కారణమేమో!

## సింహపురికి పెళ్లి కళ




పెళ్లికళ వచ్చేసింది బాలా... అని ఓ సినిమాలో హీరో పాట పాడినట్లు సింహపురి పెళ్లి కళతో ధగధగలాడిపోతుంది. మే 28తేదీ నుంచి జూన్ 8 తేదీ వరకు జిల్లాలో మొత్తం మీద కలిపి పాతికవేల పెళ్లిళ్లు జరగనున్నాయి. ఇన్ని పెళ్లిళ్లా అని ఆశ్చర్యపోవడం చాలా మందివంతయితే వీటి మూలంగా లక్షమందికి పైగా హైరర్స్, లైటింగ్, పెళ్లి మండపాలు, క్యాటరింగ్, టాక్సీలు నడిపేవారు, టైలర్లు, ఫోటో, వీడియోగ్రాఫర్లు, బంగారు అంగళ్లు, వస్త్ర దుకాణాల నిర్వాహకులు యమబిజీగా వున్నారు. మొత్తం మీద ఈ పెళ్లిళ్ల ఖర్చు ఆర్థిక మాంద్యం వున్నా వందలకోట్ల పైమాటే. పెళ్లిళ్లు ఎక్కువ జరిగితే వర్షాలు తక్కువని పెద్దలు చెబుతుండేవారు. వర్షాలు మాటేమిటో గాని ఎండలు మాత్రం అదరగొట్టేస్తున్నాయి సుమీ!

# భక్తశిఖామణి ఆంజనేయుడు!



శ్రీరామచంద్రుడిని గుండెల్లో ప్రతిష్ఠించుకొన్న భక్త శిఖామణి ఆంజనేయుడు. చిరంజీవి అయిన హనుమంతుడు 11వ రుద్రావతారం. వైశాఖ బహుళ దశమి పూర్వాభాద్ర నక్షత్రాన ఆంజనేయుడు జన్మించినందున ఏటా ఆ రోజున హనుమజ్జయంతిని దేశవ్యాప్తంగా జరుపుకొంటారు.

వానరులైన అంజనాదేవి–కేసరి దంపతులకు వాయుదేవుని వల్ల శివాంశతో జన్మించినవాడు ఆంజనేయుడు. ఎర్రగా వున్న సూర్యుడిని ఫలంగా భావించి దానిని అందుకొనేందుకు ప్రయత్నించాడు మారుతి. ఆనాడు రాహుగ్రహణ కాలం. ఆంజనేయుడ్ని చూసి రాహువు భయపడి పారిపోయి ఇంద్రుడితో మొరపెట్టుకోగా ఆయన తన వజ్రాయుధంతో ఆంజనేయుని హనుమల (చెక్కిళ్ల)పై కొట్టడంతో మూర్ఛపోతాడు. దీన్ని చూసిన వాయుదేవుడు తన కుమారుడైన ఆంజనేయుడు వజ్రాయుధం ఘాతానికి గురికావడంతో సహించలేక వాయు సంచారాన్ని నిలిపివేశాడు. సమస్త జీవరాశి గాలి లేక కలవరపాటుకు గురైంది. గంధర్వులు, దేవతలు చివరకు బ్రహ్మదేవుడిని శరణు కోరుతారు. బ్రహ్మ తన అమృతహస్తాలతో నిమరడంతో మేలుకొన్న మారుతి అప్పటి నుంచి హనుమంతునిగా పేరుగాంచాడు. ఆయన సూర్యుని నుంచి తేజస్సును వ్యాకరణ, వేదశాస్త్రాలలో పాండిత్యాన్ని సంపాదించారంటారు.

హనుమంతుడు అటు శ్రీరామునికి భక్తునిగాను, సీతను రావణుడి చెర నుంచి విడిపించేందుకు దూతగా, రామరావణ యుద్ధంలో సేనానిగా రాముడికి చేదోడువాదోడుగా వుంటూ తన పాత్రను భక్తి ప్రపత్తులతో నిర్వహించాడు.

సుగ్రీవుడి వెంట నిలచి వాలి సంచరించలేని రుష్యముక పర్వతంపై నివాసం ఏర్పరచుకొని ఆయనకు రక్షణగా నిలిచాడు. సీతను వెతికే సమయంలో రామలక్ష్మణుల వెంట నడిచాడు. సముద్రాన్ని దాటి సీతాదేవి జాడ తెలుసుకొన్నాడు. రాముడి ముద్రికను సీతమ్మకిచ్చి, ఆమె అందజేసిన చూడామణిని రామచంద్రునికి తెచ్చిచ్చాడు. లంకా దహనం చేసి కార్యశీలిగా పేరుగాంచాడు.

సీతమ్మ తలలో సింధూరాన్ని చూసి దాని వలన శ్రీరామునికి ఆయుష్షు వృద్ధి అని తన ఒంటి నిండా నింపుకొన్నాడు. అందువల్ల హనుమంతుడిని సింధూరంతో పూజిస్తారు. మహేంద్రగిరిపై తపస్సు చేసుకొంటూ అయోధ్య వెళ్లిన ఆంజనేయుడికి సీతాదేవి శ్రీరామునికి తమలపాకులు ఇవ్వడం చూసి రాముడికి ఆరోగ్యవృద్ధిని తెలుసుకొని తమలపాకులను దేహం నిండా కుట్టుకొన్నాడు. హనుమంతుడ్ని తమలపాకులతో పూజించడానికి ఇది ఒక కారణంగా చెప్తారు. దీని వలన హనుమంతుడు శాంతిస్తాడట.

హనుమజ్జయంతి రోజున వాడవాడలా ఉత్సవాలు నిర్వహించి దండకం, ఆంజనేయ కవచం, స్తుతి, చాలీసా, మంగళాష్టకం, పంచరత్నమాల, సుందరకాండ పారాయణం చేస్తారు. యత్ర యత్ర రఘునాధ కీర్తనం – తత్ర తత్ర కృతమస్తకాంజలిం అంటారు. ఎక్కడయితే శ్రీరాముడిని కీర్తిస్తారో అక్కడ హనుమంతుడు చేతులు జోడించి వుంటాడని ప్రతీతి.

**జూన్ 7న హనుమజ్జయంతి సందర్భంగా...**

# వారఫలాలు

*తేది 5-06-2010 నుండి 11-06-2010 వరకు మేష, వృషభాల్లో బుధుడు; వృషభంలో రవి; మిథున, కర్కాటకాల్లో శుక్రుడు, మిథునంలో కేతువు; సింహంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; కుంభ, మీన, మేష, వృషభాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

7 తేది హనుమజ్జయంతి.

### శుభ ముహూర్తాలు

6 తేదీ వివాహాదులకు తె.3.00 గం.ల నుండి 5.00 వరకు మేషలగ్నాన.

6, 7తేదిలలో వివాహాదులకు ఉ.8.30 గం.ల నుండి 9.30 వరకు కర్కాటకలగ్నాన శుభ ముహూర్తాలున్నాయి.

### జూన్ తిథులు

**నిజ వైశాఖ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 5 | శని | అష్టమి | సా.4.38 | గం.ల.వ |
| 6 | ఆది | నవమి | సా.6.30 | గం.ల.వ |
| 7 | సోమ | దశమి | రా.7.49 | గం.ల.వ |
| 8 | మంగళ | ఏకాదశి | రా.8.29 | గం.ల.వ |
| 9 | బుధ | ద్వాదశి | రా.8.26 | గం.ల.వ |
| 10 | గురు | త్రయోదశి | రా.7.43 | గం.ల.వ |
| 11 | శుక్ర | చతుర్దశి | సా.6.23 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

జరిపిన సంప్రదింపులు సంతోషాన్నిస్తాయి. ప్రతి పని శ్రద్ధగా, పట్టుదలతో పథకం ప్రకారం నిర్వహిస్తారు. ఎదురు చూసిన చోటి నుండి ఆదాయం చక్కగా లభిస్తుంది. వసతిగృహమార్పిడులకు అవకాశాలున్నాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. వ్యాపారంలో పోటీనెదుర్కొంటారు. కొత్తఖాతాదారులు ఏర్పడే అవకాశం కలదు. శుభకార్యాలకు వెచ్చిస్తారు. మూర్ఖపు పట్టుదల పనికిరాదు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

కోరుకొన్నవి కోరుకొన్న రీతిలో అనుభూతిలోకి వస్తాయి. నూతన వృత్తికి సంబంధించి చేసే ప్రయత్నాలకు మంచివారి తోడ్పాటు లభిస్తుంది. ఇతరులకిచ్చిన మాట నిలబెట్టుకొని మన్ననలందుకొంటారు. కుటుంబసభ్యులతో అనుకూలంగా నడుచుకోవాలి. మనశ్చింత ఉండవచ్చు. ఖర్చులు కూడ అధికం. ఆదాయం బాగుంటుంది. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

మంచిమిత్రుల తోడ్పాటుతో మేలు ఫలితాల నందుకొంటారు. దైవపూజా కార్యక్రమాల్లో పాలుపంచుకొంటారు. వారసత్వ ఆస్తులకు సంబంధించిన ఇబ్బందులు తొలగుతాయి. మనశ్చింత. పనుల్లో ఆటంకం. పరిచితులకోసం ధనం, కాలం వెచ్చించవలసి వస్తుంది. విశ్రాంతి తక్కువ. నష్టాల నెదుర్కొంటారు. అధికారుల నుండి సాయమందుతుంది. గృహాలంకరణలో శ్రద్ధ చూపుతారు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

వాహనాలు నడిపే సమయంలో జాగ్రత్త అవసరం. ఖర్చులు ఆదాయాన్ని మించవచ్చు. నిర్విఘ్నంగా పనులు జరగడానికి దైవ ప్రార్థన చేయండి. బంధువుల కారణంగా చికాకు ఉండవచ్చు. ఆత్మవిశ్వాసంతో పనులు జరుపుకొంటూపోతారు. బంధుమిత్రుల సమాగమం. ఆనందం. ఒత్తిడి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. ఉత్సాహంగా గడుస్తుంది. కళత్రసంబంధం బాగుండదు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

చాలా దినాలుగా చేయదలచిన పనిని ఖచ్చితంగా నిర్వహిస్తారు. అత్యవసరమైన గృహోపకరణాలు కొని సౌకర్యాలు పెంచుకొంటారు. ఇంటిలో ఇరుగుపొరుగు వారితో వినోదకార్యాలవైపు మనసు పోనిస్తారు. నూతనోత్సాహంతో పనులు జరుపుకపోతారు. విజయపరంపరలు. అధికారుల నుండి మేలు వార్త. వృత్తిలో ముందంజ వేస్తారు. భూభవనాలు కొనే ప్రయత్నాలు చేస్తారు.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

ఆరోగ్యవిషయాలు చక్కగా ఉంటాయి. ఆప్తమిత్రుల తోడ్పాటు లభిస్తుంది. సమాజంలో గౌరవ మర్యాదలు ఇనుమడిస్తాయి. ఎన్నాళ్లగానో ఎదురుచూసిన ప్రియవార్తా శ్రవణం చేస్తారు. కుటుంబసభ్యులతో ఉంటూవచ్చిన స్పర్థలు తొలగుతాయి. వారసత్వపు గొడవలు ఒక కొలిక్కి వస్తాయి. ఒక విధంగా శుభకాలమనే చెప్పాలి. శారీరక శ్రమ, సోదరుల మూలంగా ఇబ్బందులుండవచ్చు.



**తుల**
చిత్తా 3, 4 పా, స్వాతి, విశాఖ 1, 2, 3 పా

సామాజిక కార్యక్రమాల్లో పాల్గొని గౌరవమర్యాదల్ని పెంచుకొంటారు. సంతానానికి సంబంధించిన విషయాలకు ప్రాధాన్యమిస్తారు. ప్రముఖుల పరిచయాలు సత్ఫలితాల నిస్తాయి. మంచివారి సహాయ సహకారాలు అందుతాయి. వారం మధ్య నుండి మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త. ఆరోగ్యవిషయాలు కూడ అంతంత మాత్రమే. శ్రమాధిక్యత. కోపావేశాలు తగ్గించుకోవాలి.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

పట్టిందల్లా బంగారమయ్యే కాలం. ధనాదాయం ఎదురు చూసిన రీతిలో ఉంటుంది. నూతన మిత్రులు పరిచయమవుతారు. శుభకార్యాల ప్రసక్తి చర్చకు వస్తుంది. రియల్ ఎస్టేట్ విషయాలు ఊహించని విధంగా ఊపందుకొంటాయి. మిత్రుల వల్ల లాభప్రాప్తి. గృహవాతావరణాన్ని నిర్మలం చేసి, శోభాయమానం చేయ ప్రయత్నిస్తారు. ఇతరులతో సంబంధాలు మెరుగ్గా ఉంటాయి.



**ధనస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

మనశ్శాంతి లభిస్తుంది. అన్ని విషయాలు తృప్తినిస్తాయి. మిత్రులతో, సన్నిహితులతో విహారయాత్రలు చేస్తారు. పొదుపు ప్రయత్నాలు పథకం ప్రకారం చేస్తారు. పూజాదులలో మనసు పోనిస్తారు. ఆదాయమార్గాలు చక్కగా తోస్తాయి. మంచితనంతో బాకీలు వసూలవుతాయి. సమస్యల్ని జాగ్రత్తగా అర్థంచేసుకొని మసలాలి. బంధుమిత్రులతోటి విరోధభావం తొలగుతుంది.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ప్రియవార్తాశ్రవణం మనసుకు ఆనందాన్ని, ఉత్సాహాన్నిస్తుంది. నిత్యకృత్యాలు అత్యధిక శ్రద్ధతో పూర్తి చేస్తారు. ఏకాగ్రత పెరుగుతుంది. సుఖభోగాలవైపు మనసు పోతుంది. సమాజంలో గౌరవ మర్యాదలు పెరుగుతాయి. ప్రతి పని చాలా మెలకువగా చేస్తారు. సోదరతుల్యుల నుండి ఆదాయం. గృహిణులకు హాయిగా గడుస్తుంది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ఆశ్చర్యపడే రీతిలో అద్భుత పరిణామాలు చోటు చేసుకొంటాయి. ఆహారవిషయంలో శ్రద్ధలేకుంటే అనారోగ్యపరిస్థితులు ఆందోళననిస్తాయి. ఎదురుచూసిన వారిని కలుసుకొంటారు. దూరపు బంధువుల నుండి శుభవార్తాశ్రవణం. వాహనాల విషయంలో శ్రద్ధ చూపుతారు. వృత్తిలో నూతన వ్యక్తుల తోడ్పాటు ఉంటుంది. ధనవిషయంలో తెలివిగా ప్రవర్తించాలి. ఆర్థికవిషయాలు అంతంత మాత్రమే.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. బంధుమిత్రుల సమాగమం ఆనందాన్నిస్తుంది. శుభకార్యాలకై వెచ్చిస్తారు. సంతానం వల్ల మనశ్శాంతి కొరవడుతుంది. మాటలు జాగ్రత్తగా రానివ్వాలి. తగాదాల్లో విజయం మీదే. ఇష్టులైనవారి ద్వారా మీరు కోరుకొన్నవి సాధించుకొంటారు. సోదరులు సాయమందిస్తారు. కుటుంబ సభ్యులతో గొడవలు. ఊహించనిరీతిలో ధనవ్యయమవుతుంది.

# ప్రాచీన శాస్త్రాల్లో పదహారు గదులు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ దయానంద సరస్వతి — బెంగుళూరు*

** ప్రాచీన శాస్త్రాల్లో 16 గదుల ప్రాముఖ్యం వాటి స్థానాల్ని గురించి చెప్పండి?*

విశ్వకర్మ ప్రకాశిక, నారదసంహితలలో ఈ వర్ణనలున్నాయి. నలువైపులా నాలుగు గదులు వుంటాయి. అందులో చెప్పుకోదగ్గవి దక్షిణం వైపు మధ్య గది పడకకు, తూర్పు మధ్య గది స్నానాలకు, ఉత్తర మధ్య గది స్వర్ణరత్నాభరణాలకు, పశ్చిమాన మధ్యగది భోజనానికి ఉపయోగించాలని చెప్పారు.

*వై.ఆర్.నాగరాజు — చిత్తూరు*

** నా వయసు 70. నేనిపుడు గృహనిర్మాణం చేయవచ్చా?*

వయసు పైబడిన వారి పేర నిర్మాణాలు చాలా వాస్తుశాస్త్రరీత్యా జరగాలి. లేని పక్షంలో అనవసర సమస్యలు తెచ్చుకున్నట్లే.

*డాక్టర్ డి.ముత్యాలనాయుడు — చిత్తూరు*

** 'పంచసూత్ర సమన్వితం' గురించి అగస్త్య వాస్తులో చదివాను. వివరించగలరా?*

'వాస్తు సూక్త నిదానం'లో బ్రహ్మ, నాభి, కమల అంత్యార్థ, ప్రథమార్థ అంశాలున్నాయి. ఇవన్నీ సక్రమంగా అమరితే గృహస్థ లక్ష్మీకటాక్షానికి పాత్రుడవుతాడు.

*వై.అశ్వనీనాయుడు — గూడూరు*

** గృహ నిర్మాణం జరిగి మూడు నెలలు గడిచింది. ఇబ్బడిముబ్బడిగా సమస్యలు దాడి చేస్తున్నాయి.*

ఆకస్మిక సమస్యలున్నప్పుడు వాస్తుదోషాలు తీవ్రంగా ఉన్నట్లే లెక్క. దోషాలు సరిచేసుకోవడం అంతకు క్రితం యంత్ర ప్రతిష్ట చేసుకోవడం సమస్యల్ని పరిష్కరిస్తాయి.

*ఎం.లకుమారెడ్డి — చెన్నై*

** మాది విశాలమైన స్థలం. ఈ మధ్య అకారణంగా పిల్లలు పెద్దలు అనారోగ్యవంతులవుతున్నారు.*

స్థలంలోని ఎనిమిది దిక్కుల్లో 3×3 అడుగుల గుంతలు తీయండి. అందులో వెంట్రుకలు, ఎముకలు, పాత ఇటుకలు వుంటే తీసివేసి శంఖువు, 'నిమ్మ', పసుపు, కుంకుమ చల్లి తిరిగి పూడ్చివేసి శక్తి యంత్రప్రతిష్ట చేసుకోండి. ఫలితం వుంటుంది.

*ఎ.కుసుమకుమారి — కర్నూలు*

** ఆర్థిక పరిస్థితి ఘోరంగా వుంది? బాగుపడాలంటే మెరుగు పరుచుకోవాలంటే వాస్తు సూత్రాలేవి పాటించాలి?*

దిక్ కోణ వేధలు, ఉత్తర దిశాభ్రంశాలు సవరించుకొని, తూర్పు, ఉత్తరాల్లో సవరణలు చేసుకొని 'కుబేర యంత్రం' ప్రతిష్టించుకొంటే పరిస్థితి మెరుగుపడుతుంది.

*కె.వి.ఎత్తిరాజులు — ఆత్మకూరు*

** వ్యాపార రీత్యా పెద్దగా కలసిరాలేదు. వాస్తు ప్రకారం నేనేం చేయాలి?*

ఆత్మకూరుకు దక్షిణ, పశ్చిమ దిశాలోపాలెక్కువ. అందువల్ల గృహ, వ్యాపార సంస్థల నిర్మాణాలు దిశాలోపాలు లేకుండా చూసుకోవాలి. యంత్ర ప్రతిష్ట వల్ల వ్యాపారం పెరుగుతుంది.

*టి.రేణుకానాయుడు — చెన్నై*

** తూర్పు, ఉత్తరం స్థలాలే మంచివా? అవే కలసి వస్తాయా?*

ప్లానులో చాలా వాస్తు దోషాలున్నాయి. వాస్తు దోషాలున్న స్థలం ఏ దిక్కు అయినా ఒకటే. తాత్కాలికంగా వాస్తు (ప్రథమార్థ) యంత్రప్రతిష్ట చేయండి. తర్వాత వాస్తును సరిదిద్దుకోండి.

*కె.వి.నరసింహులునాయుడు — ఆత్మకూరు*

** ఇల్లు కట్టేటప్పుడే పశ్చిమ, దక్షిణాలు ఖాళీ జాగా వదిలివేశాను.*

తూర్పు, ఉత్తరాల ఖాళీ స్థలంలో నాలుగవ వంతు, ఆరవ వంతు ఖాళీ స్థలాల్ని పశ్చిమ దక్షిణాల్లో వదలాలి. తూతూ మంత్రంగా వదలితే సరిపోదు.

*వై.వి.హిమజారెడ్డి — నెల్లూరు*

** ఏయే స్థలాలు కొనరాదు?*

దేవాలయం, దర్గా, మసీదు, చెరువు, స్మశానం, చిత్తడి నేలలు, ఊరిదిబ్బలు వున్న చుట్టు ప్రక్కల స్థలాలేవీ కొనరాదు.

# విశ్వనాధరావుపేటలో మంచినీటికి కటకట!

బోగోలు మండలంలో అతిపెద్ద మేజర్ పంచాయితీ విశ్వనాధ రావుపేట గ్రామ పంచాయితీలో పారిశుద్ధ్యం చాలా అధ్వాన్నంగా వుంది. డ్రైనేజి కాల్వలు నిర్మించకపోవడం వలన మురికినీరంతా ఒక చోట చేరి దుర్గంధానికి జనం ముక్కుపుటాలు పగిలి పోతున్నాయి. జనవాసాల మధ్యన ఇలా వుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడు తున్నారు. అలాగే పంచాయితీ పరిధిలో త్రాగు నీటి ఎద్దడి తీవ్రంగా వుంది. ఒకే పైపులైన్ ద్వారా ఒకరోజు త్రాగునీరు, మరోరోజు ఉప్పు నీటిని విడుదల చేస్తుంటారు. ఇలా చేయడం వలన త్రాగునీరు కలుషితమైపోతుంది.

విశ్వనాధరావుపేట గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీకి చెందిన లేళ్ల పల్లి సురేష్ గత ఎన్నికలో గెలుపొందారు. పంచాయితీ సర్పంచ్‌గా గెలిచిన తర్వాత ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను ఏమాత్రం పట్టించు కోవడం లేదు. విశ్వనాధరావుపేటలో అధి కంగా రైల్వేలో పని చేసే ఉద్యోగులు నివాసం వుంటున్నారు. ఇంటి పన్నుల రూపంలోనూ, ఎస్ఎఫ్‌సి, 12వ ఆర్థికసంఘం నిధులు లక్ష లాదిరూపాయలు పంచాయితీకి వస్తున్న వీటిని ప్రజల అవసరాలు తీర్చేందుకు వినియోగిం చడంలో పాలకవర్గం పూర్తిగా వైఫల్యం చెం దింది. అలాగే గ్రామంలో అంతర్గత రోడ్లు అధ్వాన్నంగా కనిపిస్తూ పాలకవర్గం నిర్లక్ష్యాన్ని ఎత్తిచూపుతున్నాయి.

డ్రైనేజి కాల్వలు, పారిశుద్ధ్యం, త్రాగునీటి సరఫరా తదితర సమస్యలపై అనేక దఫాలు గ్రామపంచాయితీ సర్పంచ్‌కు విన్నవించుకున్నా ఫలితం లేకుండా పోయిందని స్థానికులు వాపో యారు. రాత్రిపూట వీధిలైట్లు సక్రమంగా వెల గని పరిస్థితి వుంది. ఏదైనా సమస్యపై విన్న వించుకునేందుకు పంచాయితీ కార్యాలయా నికి వెళ్లిన వారికి కుర్చీలు, టేబుళ్లు దర్శనమి స్తుంటాయి తప్ప కార్యదర్శి, సర్పంచ్ అందు బాటులో వుండరన్న విమర్శలు వున్నాయి. ప్రధాన వీధులలో మాత్రమే సిమెంటు రోడ్ల నిర్మాణం చేపట్టారు. మిగిలిన వీధుల గురించి పట్టించుకున్న దాఖలాల్లేవు.

తాగునీటి సరఫరాను పంచాయితీ పాలకవర్గం సక్రమంగా చేయకపోవడంతో కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు చారిటబుల్ ట్రస్టు ఆధ్వర్యంలో ట్యాంకర్ల ద్వారా అందిస్తు న్నారు. ఈ క్రమంలో పంచాయతీలోని సమ స్యలపై స్థానికులు వెల్లడించిన అభిప్రాయా లను ప్రక్కన ఇస్తున్నాం.



**పారిశుద్ధ్యం అధ్వాన్నం!**

పంచాయితీ పరిధిలో పారిశుద్ధ్యం చాలా అధ్వాన్నంగా వుంది. వీధిలో వేసిన చెత్తా, చెదా రాన్ని కూడా రోజుల తర బడి తొలగించడం లేదు. మురికినీరు బయ టకు వెళ్లేందుకు మార్గం లేకపోవడంతో ఒకే చోట నిల్వ చేరడం వల్ల భరించరాని వాసన వస్తుంది. ఈ విషయమై పంచాయితీ సిబ్బం దికి ఎన్నిసార్లు చెప్పిన పట్టించుకోలేదు.

– రమణమ్మ



**త్రాగునీరే సరఫరా చేయాలి!**

పంచాయితీ పైపు లైన్ల ద్వారా ఇప్పటివరకు ఒకరోజు త్రాగునీరు, మరోరోజు ఉప్పునీటిని సరఫరా చేస్తున్నారు. ఇలాచేయడం వల్ల నీరు కలుషితం అవుతుంది. అలా కాకుండా ప్రతిరోజు త్రాగునీటిని సరఫరా చేసే విధంగా అధికారులు చర్యలు తీసుకోవాలి.

– సామ్యేల్



మురుగు పేరుకున్న డ్రైనేజి కాల్వ.



మట్టి రోడ్లే గతి.

అవినీతి కథ

# దోబిఘాట్ స్థలంపై కబ్జాదారుల కన్ను!

**నెల్లూరు ముత్తుకూరు బస్టాండ్ సమీపంలో వందలయేళ్ల చరిత్రగల దోబిఘాట్‌ను దురాక్రమించను కొందరు ఒక పథకం ప్రకారం పావులు కదుపుతున్నారు.**



ఈ దోబీఘాట్‌ను దురాక్రమించను రంగం సిద్ధం.

నెల్లూరు నగరం నడిబొడ్డున వున్న దోబిఘాట్ స్థలంపై కొంతమంది కబ్జాదారుల కన్ను పడింది. ఎన్నో సంవత్సరాల చరిత్ర కలిగిన ఈ స్థలాన్ని గతంలో కొందరు ఆక్రమించాలని ప్రయత్నించి విఫలం చెందారు. ఇటీవల ఈ స్థలాన్ని ఏదో ఒక విధంగా ఆక్రమించుకోవాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. నగరం లోని ముత్తుకూరు బస్టాండుకు సమీపంలో దాదాపు వంద సంవ త్సరాల క్రితం దోబిఘాట్ ఏర్పాటయ్యింది. ఇక్కడ అధికంగా చాకలి వీధిలో నివసించే రజకులు బట్టలు ఉతుకుతూ జీవనం సాగించేవారు. ఎకరా 50 సెంట్లు విస్తీర్ణం గల ఈ స్థలం ఆక్రమణదారుల పుణ్యమా అంటూ తూర్పువైపున వుండే స్థలం నివాసాలుగా మారిపోయింది.

ఒకప్పుడు 50 కుటుంబాలకు చెందినవారు ఇక్కడ కులవృత్తిని నిర్వహించేవారు. కాలక్రమంలో ఈ స్థలం చుట్టూ నివాసాలు ఏర్ప డడం, నీటి పారుదల కాల్వలు లేకపోవడం కారణంగా ప్రస్తుతం పది, పదిహేను కుటుంబాలకు చెందినవారు మాత్రమే ఇక్కడ బట్టలు వుతు కుతూ జీవనం సాగిస్తున్నారు. ఒకప్పుడు కళకళలాడే ఈ దోబిఘాట్ అధికారులు, పాలకుల నిర్లక్ష్యం కారణంగా నేడు కళతప్పింది. ప్రస్తుతం ఇక్కడ బట్టలు శుభ్రం చేయాలంటే మునిసిపాల్టీ కొళాయిలపై ఆధార పడాల్సి వస్తుంది. కొళాయిలకు పైపులు అమర్చి తొట్లు నింపుకుం టున్నారు.

ఎక్కువ మోతాదులో వుండే బట్టలకు నీరు సరిపడని పక్షంలో రిక్షాలపై వేసుకుని పెన్నానదికి తీసుకెళ్లి శుభ్రం చేసుకునే పరిస్థితి ఏర్పడింది. నీటిని నిల్వ చేయాలన్న వుద్దేశంతో దాదాపు 25 సంవత్స రాల క్రితం ఇక్కడ ప్రభుత్వం ఎనిమిది బావులను త్రవ్వించడం జరి గింది. వీటిలో ఆరు బావులు పూర్తిగా ఎండిపోగా రెండు బావులలో మాత్రం కొద్దిగా నీరు వుంటుంది. నిర్మించిన బావులలో పూడిక తీయక పోవడంతో ఎండిపోయాయి. దోబిఘాట్ కూడా పూర్తిగా శిథిలావస్థకు చేరుకుంది. దోబిఘాట్ చుట్టుప్రక్కల ప్రాంతం అంతా ముళ్లపొదలు నిండిపోయాయి. ఇక్కడ బట్టలు శుభ్రం చేసేవారు వంతుల వారీగా కులవృత్తి చేసుకుంటున్నారు.

గత అయిదు సంవత్సరాల క్రితం ఆత్మకూరు బస్టాండ్ సమీ పంలో ఫ్లైఓవర్ బ్రిడ్జి నిర్మాణం కారణంగా అక్కడ షాపులు కోల్పోయిన వారికి దోబిఘాట్ ఆనుకొని వున్న ముత్తుకూరు బస్టాండ్ రోడ్డు ప్రక్కన షాపులు కేటాయించడం జరిగింది. అయితే ఇక్కడ షాపులు ఏర్పాటు చేస్తే వాహనాల రాకపోకలకు తీవ్ర అంతరాయం కలుగుతుందన్న విషయం మునిసిపల్ అధికారులు, ప్రజాప్రతినిధులకు తెలిసినా కూడా రాజకీయ లబ్దికోసం ఏర్పాటు చేశారు. దీంతో ప్రక్కనే వున్న దోబి ఘాట్‌కు ప్రమాదం ఏర్పడింది. ఈ స్థలంపై కన్నేసిన కొందరు భూకబ్జా దారులు రజకులను ప్రలోభాలకు గురిచేసి ఆక్రమించుకునేందుకు ముమ్మర ప్రయత్నాలు సాగిస్తున్నారు.

బయట ప్రాంతాలలో పాలు కొనుగోలు చేసి నగరానికి తెస్తున్న కొందరు వ్యాపారులు ఇక్కడ నుంచే సరఫరా చేస్తున్నారు. పాల క్యాన్లను దోబిఘాట్‌లోనే నిల్వ చేసి వీటికి కాపలా వుండేందుకు ఒక వాచ్ మెన్‌ను కూడా ఏర్పాటు చేసుకున్నారు. పాల వ్యాపారం పేరుతో తమ అనుచరులను రంగప్రవేశం చేయించి ఆ తర్వాత రాజకీయనేతల సహ కారంతో దోబిఘాట్‌ను స్వాధీనం చేసుకోవాలన్న ప్రయత్నంలో వున్నారు. నెల్లూరు నగరంలోనూ, శివారు ప్రాంతాలోనూ భూముల ధరలు విప రీతంగా పెరిగిపోతున్నాయి. ఈ క్రమంలో కోట్లరూపాయల విలువ చేసే ఈ స్థలాన్ని దురాక్రమించి ప్లాట్లుగా చేసే అవకాశం వుంది.

కొంతమంది రియల్‌ఎస్టేట్ వ్యాపారులు చాకలివీధిలో నివసించే పెద్దలతో మంతనాలు కూడా జరుపుతున్నారు. అంతరించిపోతున్న కుల వృత్తిని ఎన్నాళ్లు పట్టుకుని జీవిస్తారని దోబిఘాట్‌లో బట్టలు శుభ్రం చేయడం మానేస్తే ఎంతోకొంత పరిహారం ముట్టచెబుతామని ప్రలోభ పెడుతున్నారు. అధికారులు సైతం ఈ దోబిఘాట్ గురించి పూర్తిగా విస్మరించడం కూడా భూకబ్జాదారుల కన్ను పడేందుకు మరో కారణంగా చెప్పవచ్చు.





# విషయంలేని 'గోలీమార్'!

✍ అల్లూరు రహీం

దర్శకుడు పూరీజగన్నాథ్‌లో సత్తా తగ్గిందనే దానికి వరుసగా విఫలమవుతున్న ఆయన చిత్రాలను ఎత్తి చూపొచ్చు. ముంబాయిలో ఎన్‌కౌంటర్ స్పెషలిస్ట్ దయానాయక్ స్ఫూర్తితో గోపీచంద్ హీరోగా సాయిగణేష్ ప్రొడక్షన్ పతాకంపై ఆయన తీసిన గోలీమార్ చిత్రంలోనూ విషయమేమీ లేదు. జగన్నాథ్ పాత చిత్రాల తరహాలోనే మలేషియా, ఓ మాఫియా డాన్, ఆయన సామ్రాజ్యాన్ని దర్శకుడు సృష్టించిన హీరో ధ్వంసం చేసి పారెయ్యడం ఈ చిత్రంలోనూ పునరావృతమయ్యాయి. గోలీమార్ చిత్రం కూడా ఒక్క లైన్ కథే. దానిలో రెండు, మూడు ట్విస్ట్‌లు, స్క్రీన్‌ప్లే వేగంగానే నడిపినా చిత్రానికి ప్రాణమైన పాటలు సరిగ్గా కుదరలేదు. అప్పటికీ హీరోయిన్ ప్రియమణి ఈ చిత్రంలో కష్టపడి డబ్బింగ్ చెప్పుకొంది. గుండెల్లో ఏదో సడి చరణంతో సాగే పాటలో ఆమె వెండితెరపై అందాలు పరచినా ప్రయోజనం లేకుండా పోయింది. ఎందుకో దర్శకుడు పుణ్య పురుషులు జీసస్, మదర్ థెరిస్సా, దలైలామాలను పనికిమాలిన పోలికల మాటల మధ్య తీసుకరావడం బాగోలేదు. అయితే ఎన్‌కౌంటర్ స్పెషలిస్ట్‌గా గోపీచంద్ పాత్రను తెరపై స్టైలిష్‌గా మలచిన తీరు బాగుంది. తనను ప్రేమించమని గోపీచంద్ వెనుక ప్రియమణి పడే సన్నివేశాల్లో ఫీల్ మిస్ అయ్యింది. మగవాళ్లను అసహ్యించుకొనే వనితగా రోజా పాత్ర మాత్రం బాగానే కుదిరింది. సినిమాలో వ్యభిచారుల్లో నిజాయితీని నిరూపించే ఓ సన్నివేశం హృదయాన్ని మెలితిప్పుతుంది. దర్శకుడే వ్రాసిన మాటల్లో పోలీసులను కొత్త తిట్టుతో తిట్టించాడు. మరోచోట పైన వున్న ప్రెజర్స్ వల్ల పట్టించుకోం... లేకుంటే దేవుణ్ని కూడా అరెస్ట్ చేస్తాం. సంసారులకు సలహాలు సన్యాసులే చెప్పాలి. మగాడి ప్రేమ ఒకరితో ఆగదు. ఎవరైనా ఏదో ఒక సున్నాకు పడిపోతాడు... ఆలోచింపజేస్తాయి. హాస్య సన్నివేశాలు లేకపోవడం చిత్రానికి పెద్దలోటు. చక్రి సంగీతంలో కొత్తదనం లేకుండా పోయింది. పైపెచ్చు ఓ క్లబ్‌సాంగ్‌ను ఇంగ్లీషు చిత్రం నుంచి మక్కీకి మక్కీ కాపీ చేశారాయన. చోటా కె.నాయుడు తన కెమెరాతో మలేషియా అందాలు చూడచక్కగానే చిత్రీకరించినా ప్రయోజనం లేకుండా పోయింది.




చిత్ర కథలోనికి వెళ్తే గంగారామ్(గోపీచంద్) అనాథ. బాబాయ్(ఎం.ఎస్‌నారాయణ) ఆదరించడంతో పొట్టపోసుకోవడంతోపాటు నాలుగు అక్షరాలు నేర్చుకొని తానెంతో ఇష్టపడే పోలీస్‌శాఖలో ఇన్స్‌పెక్టర్‌గా జాయిన్ అవుతాడు. గంగారామ్‌లోని తెగువ చూసిన డిఐజి భరత్‌నందన్(నాజర్) అతన్ని ఎన్‌కౌంటర్ స్పెషలిస్టును చేస్తాడు. మాఫియా ముఠా నాయకులు ఖలీద్(కెల్లీదోర్జీ), తల్వార్(షవర్ అలీ)లను మట్టుపెట్టమంటాడు. తల్వార్ గ్యాంగ్ హైదరాబాద్‌లోనే వుండడంతో ఒక పథకం ప్రకారం గంగారామ్ తుడిచి పెట్టేస్తాడు. మగాళ్లను అసహ్యించుకొనే ఈవెంట్ మేనేజర్ పవిత్ర(ప్రియమణి)కి గంగారామ్ తెగనచ్చేస్తాడు. ఆమె తల్లి అరుంధతి(రోజా) విధించే కట్టుబాట్లను కాదని గంగారామ్‌ను ప్రేమించమని వెనుకపడుతుంది. అతను ఆమెకు తన ప్రేమను వెల్లడించను పిలిపించిన సమయంలో ఒక్కసారిగా పోలీసులొచ్చి గంగారామ్‌ను అరెస్ట్ చేస్తారు. అతను ఎన్‌కౌంటర్ స్పెషలిస్ట్‌గా పలువుర్ని బెదిరించి కోట్లాది రూపాయలు వసూలు చేశాడని, విదేశాల్లో హోటళ్లు నడుపుతున్నాడని, వేశ్యల సాంగత్యంలో గడుపుతున్నాడని డిఐజి భరత్‌నందన్ మీడియాకు ఆధారాలతో సహా వెల్లడిస్తాడు. తననెందుకు అరెస్ట్ చేశారని గంగారామ్ అరచి గీపెట్టగా డిఐజి తాను, ఖలీద్ చీకటి సామ్రాజ్యపు వ్యాపారంలో భాగస్వాములమంటాడు. ఒక పథకం ప్రకారమే తల్వార్ గ్యాంగ్‌ను గంగారామ్ చేత అంతమొందింపజేశానని వెల్లడిస్తాడు. గంగారామ్‌ను ఎన్‌కౌంటర్ చేయను ఏసిపి తీసుకెళ్లగా అతను తప్పించుకొని గంగూభాయ్ అవతార మెత్తుతాడు. తనను కేసుల్లో ఇరికించిన వారందరినీ ఒక పథకం ప్రకారం చంపి పారేస్తాడు. చివరికి మలేషియా వెళ్లి ఖలీద్‌ను అంతమొందిస్తాడు. కొత్త డిజిపి(ప్రకాష్‌రాజ్) సలహాపై మలేషియాలోని చీకటి సామ్రాజ్యపు పునాదులు కదలించను పోలీసు మనిషిగా స్థిరపడిపోవడంతో చిత్రం ముగుస్తుంది.



## వాళ్లిద్దరికి బెడిసింది!



కండల వీరుడు సల్మాన్‌ఖాన్, ఆయన ప్రేయసి కత్రినాకైఫ్‌కు మధ్య సంబంధాలు దెబ్బతిన్నాయని బాలీవుడ్ మొత్తం బహిరంగంగానే గుసగుసలాడుతోంది. అయితే కత్రినా మాత్రం ఈ విషయాన్ని స్పష్టంగా చెప్పకుండా – నేను అత్యంత గౌరవించే వ్యక్తుల్లో సల్మాన్‌దే అగ్రస్థానం అంటూ వెరైటీ స్టేట్‌మెంట్లు ఇస్తోంది. సల్మాన్‌ను నేను దగ్గర్నుంచి చూసినప్పటి నుంచి ఇద్దరి మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది. ఒక్క మాటలో చెప్పాలంటే – నాగుండెల్లో నాకంటే స్నేహితునిగా అతని స్థానమే పదిలం. మా గురించి చాలా మంది చాలా రకాలుగా అనుకోవచ్చు. వాళ్లేం మాట్లాడుకుంటున్నారు అన్నది మాకు ముఖ్యం కాదు. నేను, సల్మాన్ ఏం మాట్లాడుకుంటున్నాం అన్నదే ముఖ్యమంటుంది కత్రినా.

## మళ్లీ హనీమూన్‌కు...



హీరోయిన్ శిల్పాశెట్టి, వాళ్లాయన కుంద్రా రెండవ సారి హనీమూన్ ట్రిప్‌కు సిద్ధమయ్యారు. మొన్న నేగా వెళ్లొచ్చారని విలేకరులు శిల్పాను అడిగితే ఈ ప్రశ్నలు వద్దండి. మేం కొత్తజంట. ఆ మాత్రం స్పీడ్ వుంటుందని సిగ్గుల్లుతూ చెప్పింది. ఈ మధ్యే శిల్పాశెట్టి, ఆమె భర్త రాజ్‌కుంద్రా బహామాస్‌కు వెళ్లి తిరిగి వచ్చారు. ఇప్పుడేమో మరో నెల న్నరపాటు యూరప్‌లో తిరగనున్నారు. హనీమూన్‌కు వెళ్లక ముందే ముంబాయిలోని న్యూ జుహూ ప్రాంతంలో తాము కొన్న కొత్త ఇంట్లో పాలు పొంగించి, కాపురానికి అన్నీ ఏర్పాట్లు చేసుకొంటామంటుంది ఈ సుందరి.

## ముమైత్ వృద్ధాశ్రమం



ఐటమ్ గర్ల్ ముమైత్‌ఖాన్ ముసలాళ్లంటే తనకెంతో ఇష్టమంటుంది. పరిశ్రమలో డబ్బు గడించిన నటులు వ్యాపారాల్లో బిజీగా వుంటే ముమైత్ మాత్రం హైదరాబాద్‌లో వృద్ధుల కోసం ఓ ఆశ్రమం పెట్టనుంది. నేను డబ్బు సంపాదించింది ఇక్కడే. తెలుగువాళ్ల రుణం తీర్చుకొనేదుకు ఈ ఆశ్రమమంటుంది. ఇద్దరు అనాథ పిల్లలను కూడా దత్తత తీసుకొని పెంచుతానంటుంది. తనకు 30 ఏళ్లు వచ్చిన తర్వాత పెళ్లి గూర్చి ఆలోచిస్తానంటుంది. ఏది ఏమైనా ముమైత్‌ఖాన్‌లోని సేవాభావాన్ని పరిశ్రమలో పలువురు ప్రశంసిస్తున్నారు.

## పవన్ సరసన అనుష్క



కొమరం పులి తర్వాత పవన్‌కళ్యాణ్ నటించే చిత్రానికి కొబ్బరికాయ కొట్టేశారు. హిందీలో విజయవంతమైన 'లవ్ ఆజ్ కల్' సినిమా ఆధారంగా ఈ సినిమా తీయనున్నట్లు పోటిడి. జయంత్ సి.పరాన్జీ దర్శకుడు. ఈ సినిమా హీరోయిన్ కోసం చేసిన అన్వేషణను నిర్మాత గణేష్‌బాబు ముగించాడు. పొడుగుకాళ్ల సుందరి అనుష్కను మొత్తానికి హీరోయిన్‌గా ఎంపిక చేశారు. అరుంధతి తర్వాత అనుష్కకు పెరిగిన క్రేజ్ ఆధారంగా ఈ ఎంపిక చేశారంటున్నారు.

## కరుణ చూపిన కరీనా





బాలీవుడ్ హీరోయిన్ కరీనా కపూర్ అంటే ఒక్క సైఫ్ అలీఖానే కాదు ప్రాణమిచ్చేవారు పలువురున్నారని నిరూపించాడు ఓ అభిమాని. జబ్ వీమెట్ చిత్రంలో మాదిరి కరీనా అమాయకంగా వుంటుందని తలచి ఆమె అభిమాని ఆమెను కలసి మాట్లాడాలని ముంబాయి వచ్చాడు. కాని ఆమె ఇంటిముందు గార్డులు లోనికి పంపలేదు. అయినా అతను ఆమె ఇంటి ముందు నుంచి వెళ్లలేదు. మూడు రోజులపాటు కరీనా ఇంటి ముందు నిద్రాహారాలు మానిన అభిమాని గూర్చి గార్డుల ద్వారా తెలుసుకొన్న కరీనా కరుణించింది. అతన్ని ఇంటిలోనికి పిల్చి కాసేపు మాట్లాడి భోజనం పెట్టించి ఇక నుండి పంతానికి దిగవద్దని చెప్పిందట. కరీనాతో కలసి భోంచేయడంతోనే తన జన్మ ధన్యమయ్యిందంటున్నాడా అభిమాని.

# బియ్యం వ్యాపారుల అక్రమార్జన!

## ఫుడ్ గ్రెయిన్ లైసెన్సులు లేవు



నిబంధనలకు విరుద్ధంగా వ్యాపారం.

బియ్యం అమ్మకాలకు సంబంధించి ప్రభుత్వం పలు నిబంధనలు విధించినా వ్యాపారులు అక్రమాలకు పాల్పడుతూ ప్రభుత్వ ఆదాయానికి గండికొడుతూనే వున్నారు. ఏ హోల్‌సేల్, రిటైల్ వ్యాపారైనా 20 క్వింటాళ్ళ బియ్యాన్ని కల్గి వున్నట్లయితే ఫుడ్ గ్రెయిన్ లైసెన్స్ తప్పనిసరిగా పొంది వుండాలని ప్రభుత్వం జీవో 30ని విడుదల చేసింది. దీని ప్రకారం లైసెన్సు పొందేందుకు పౌరసరఫరాల శాఖకు మూడు వేల రూపాయలు చెల్లించాలి. ఈ మొత్తాన్ని చెల్లించడానికి ఇష్టపడని వ్యాపారులు అక్రమంగా బియ్యాన్ని నిల్వ చేసుకొంటున్నారు. లైసెన్స్ కల్గివుండడం వల్ల బియ్యం అమ్మకాలు, నిల్వల లెక్కలు పుస్తకంలో నమోదు చేయాల్సి వుంటుంది. దీనివల్ల పలు సమస్యలు వస్తాయని భావించిన వ్యాపారులు ఏకంగా ప్రభుత్వ నిబంధనలు పాటించడం లేదు.

జిల్లావ్యాప్తంగా బియ్యం ఉత్పత్తులకు సంబంధించి 20 క్వింటాళ్లకు పైగా వున్న హోల్ సేల్ అంగళ్లు 400కు పైగా వున్నాయి. నెల్లూరు నగరంలోనే 150 వున్నాయి. కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాలిటీలు, సూళ్లూరుపేట, నాయుడుపేట, ముత్తుకూరు, ఆత్మకూరు, సంగం, కోవూరు తదితర ప్రాంతాల్లో మరో 250 అంగళ్లు వున్నాయి. వీటిలో అధికభాగం ప్రభుత్వ లైసెన్సు పొందనివే కావడం విశేషం. అక్రమంగా బియ్యం నిల్వలు కల్గివున్న షాపులపై తరచూ దాడులు నిర్వహించి అనుమతులను పరిశీలించాల్సిన పౌరసరఫరాల శాఖ అధికారులు ఆ దిశగా దృష్టి సారించక తూతూమంత్రంగా వ్యవహరిస్తుండడంతో వ్యాపారులు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తూ కృత్రిమంగా కొరత సృష్టించి ధరలు పెంచుతున్నారు.

# సా...గుతున్న పొర్లుకట్టల పనులు!

## అంచనాలు మళ్లీ మారాయి



నెల్లూరు పొర్లుకట్టపై దర్జాగా నివాసాలు.

పాలకులు, అధికారుల నిర్లక్ష్యం కారణంగా పెన్నా పొర్లుకట్టల పనులు నత్తనడకన సాగుతున్నాయి. పెన్నాతోపాటు, కృష్ణ, గోదావరి, స్వర్ణముఖి, కాళంగి నదుల పొర్లుకట్టల బలోపేతానికి ప్రభుత్వం రెండేళ్ల క్రిందట నిధులు మంజూరు చేసింది. మిగతా నదుల కరకట్టల పనులు వేగంగా జరుగుతుంటే పెన్నా పొర్లుకట్టల పరిస్థితి మాత్రం ఒక్క అడుగు ముందుకు పడలేదు. ప్రతి ఏడాది అంచనా వ్యయం మాత్రం పెరుగుతుండడం విశేషం.

రాష్ట్ర ప్రభుత్వం 206.32 కోట్లు మంజూరు చేసింది. ఈ నిధులతో పెన్నా ఎడమ, కుడి కరకట్టలను బలోపేతం చేయాల్సి వుంది. 65 కిలోమీటర్ల మేర పొర్లు కట్టలను ఉన్నస్థితి నుంచి నాలుగు మీటర్ల ఎత్తు పెంచాలి. వరదనీరు ఎంత ఉధృతంగా వచ్చినా తట్టుకొనే సామర్థ్యాన్ని కరకట్టలు కలిగి వుండాలనేది దీని ఉద్దేశం. కట్టల నిర్మాణానికి అవసరమైన మట్టిని స్థానిక వ్యవసాయ భూముల నుంచి సేకరించాల్సి వుంది. దీనికోసం ఎకరాకు 48 వేలు విలువ కట్టిన అధికారులకు రైతులు విముఖత చూపారు. నాలుగు సార్లు టెండర్లు పిలిచినా కాంట్రాక్టర్లు ముందుకు రాలేదు. దీంతో అధికారులు పాత అంచనాలకు మరో 129.52 కోట్లు అదనంగా కలిపి మొత్తం 335.84 కోట్లతో కొత్త అంచనాలను రూపొందించారు. ఈ మేరకు ఉన్నతాధికార్లకు ప్రతిపాదనలు పంపినా ఇంతవరకు అనుమతులు రాలేదు.

ప్రతి ఏటా జూన్‌కు స్టాండర్డ్ షెడ్యూల్ రేట్లు పెరుగుతాయి. జూన్ నెలలోపుగా ప్రభుత్వ అనుమతి రాకపోతే రేట్లు తిరిగి సవరించాల్సి వుంటుంది. అధికారులు, ప్రజాప్రతినిధులు నిర్లక్ష్యం కారణంగా పెన్నా పొర్లుకట్టల నిర్మాణం ప్రశ్నార్థకమవుతోంది.

# ఎన్నికల కసరత్తుల్లో పార్టీలు!

## పెరగని డివిజన్లు - పెరిగిన ఆశావహులు!

నగర పాలక సంస్థ ఎన్నికలపై అన్ని రాజకీయపార్టీలు దృష్టిసారిస్తున్నాయి. సెప్టెంబర్ మాసానికి ప్రస్తుత పాలకవర్గం గడువు ముగియనుండడంతో ఎన్నికల నిర్వహణకు సూచనప్రాయపు ఉత్తర్వులు వెలువడడంతో అన్ని పార్టీల నేతల్లో హడావిడి మొదలయ్యింది. 50 డివిజన్లలో తమ పట్టు నిలుపుకొని ఎలాగైనా కార్పొరేషన్ పీఠాన్ని దక్కించుకొనేందుకు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు ప్రణాళికలు రచిస్తున్నాయి. గతంలో కంటే సీట్ల సంఖ్యను పెంచుకొని మరింతగా బలం పుంజుకోవాలని సిపిఎం, భారతీయ జనతా పార్టీలు ప్రయత్నిస్తున్నాయి. వీటితోపాటు తొలిసారిగా కార్పొరేషన్ ఎన్నికల బరిలోకి దిగనున్న ప్రజారాజ్యం పార్టీ కూడా నగరంలో తమ సత్తా చాటాలని ఉవ్విళ్లూరుతుంది. శాసనసభ ఎన్నికల్లో నగర నియోజకవర్గాన్ని అనూహ్య రీతిలో కైవసం చేసుకొన్నట్లుగానే కార్పొరేషన్ ఎన్నికల్లోనూ తమ బలం నిరూపించుకొనేందుకు ఆ పార్టీ నేతలు తీవ్ర ప్రయత్నాలు ఆరంభించారు.

అధికార కాంగ్రెస్ వర్గపోరు తీవ్రరూపం దాల్చడంతో ఆనం, రాజీవ్‌భవన్ నేతలు ఎవరికి వారు ఎన్నికలపై ప్రత్యేక దృష్టి సారిస్తున్నారు. టిడిపి సైతం పకడ్బందీ వ్యూహాలు పన్నుతోంది. 50 డివిజన్లతోపాటు చుట్టుప్రక్కల సుమారు 20 గ్రామాలను మునిసిపల్ పరిధిలోకి తీసుకరావాలని ప్రయత్నించినా దానికి ప్రభుత్వం ఆమోదం రాకపోవడంతో ప్రస్తుతం వున్న పాత 50 డివిజన్లకే ఎన్నికలు జరగనున్నాయి. వీటిలో సగం రిజర్వేషన్ క్రింద పోగా మిగిలినవి జనరల్ స్థానాలు. క్రొత్తవారు టిక్కెట్ దక్కించుకోవాలని, సిట్టింగ్‌లు తిరిగి తమకే దక్కాలని ప్రయత్నిస్తుండడంతో అన్ని పార్టీల్లోనూ ఎన్నికల వాతావరణం కన్పిస్తోంది.

# కళ్యాణ వైభోగమే...



నెల్లూరు దక్కన్ క్రానికల్ పత్రిక విలేకరి పత్రి రాజశేఖర్ కుమార్తె నీరజ, అలోక్‌ల వివాహం మే 30వ తేది చెముడుగుంటలోని ప్రిడ్స్ కళ్యాణమండపంలో జరిగింది.



నెల్లూరు నిర్మల ఏజెన్సీస్ అధినేత నరసింహారెడ్డి కుమార్తె అలేఖ్య, వేమిరెడ్డి కోటారెడ్డి కుమారుడు స్వరూప్‌రెడ్డిల వివాహం మే 28వ తేది చెముడుగుంటలోని ప్రిడ్స్ కళ్యాణమండపంలో జరిగింది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### ఎంసెట్ రాకెట్‌లో పొట్టేపాళెం యువకుడు

ఎంసెట్ పేపర్ లీకేజికి సంబంధించి హైద రాబాద్ టాస్క్‌ఫోర్స్ పోలీసులు ఓ ముఠాను పట్టు కొన్నారు. డాక్టర్ వృత్తి చేసినవారు, డాక్టర్ కోర్సును చేస్తున్నవారు సభ్యులుగా గల ఈ రాకెట్‌లో నెల్లూ రును ఆనుకొని వుండే పొట్టేపాళెంకు చెందిన రైతు కుమారుడు జానా భాస్కర్‌రెడ్డి వుండడం సంచ లనం రేపింది. చాలా కాలం క్రిందటే డాక్టర్ కోర్సు పూర్తిచేసిన ఈ అబ్బాయి హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నట్లు చెప్పుకొనేవాడని, పోలీసుల అరెస్టుతో అసలు విషయం వెలుగు చూడడంతో అతడ్ని కన్న తల్లితండ్రులు కన్నీరు మున్నీరవుతుండగా స్థానికులు ఆశ్చర్యపోయారు.

### సిబిఎస్‌ఇ ఫలితాల్లో గోమతి ప్రతిభ

సిబిఎస్‌ఇ ఫలితాల్లో గోమతి స్కూలు విద్యా ర్థులు ప్రతిభ కనపరచారు. సి.హెచ్.తేజ, అనుదీప్, కృష్ణప్రసాద్‌లు ఎ1 గ్రేడ్ సాధించారు. మొత్తం 57 మంది విద్యార్థులు పరీక్షకు హాజరుకాగా 100 శాతం ఉత్తీర్ణత సాధించినట్లు డైరక్టర్ పి.అరుణ తెలిపారు. గత 15 సంవత్సరాలుగా తమ పాఠశాల విద్యార్థులు ఉత్తమ ర్యాంకులు సాధిస్తున్నట్లు చెప్పారు. పదవ తరగతిలోనూ బి.వై.లక్ష్మీనాగ 567 మార్కులు, పి.లక్ష్మీసమీర 564 మార్కులు సాధించా రన్నారు. 550కు పైగా మార్కులను నలుగురు విద్యార్థులు, 14 మంది 500పైగా మార్కులను, 19 మంది 450పైగా మార్కులు తెచ్చుకొన్నారన్నారు. ఐదు మంది మ్యాథ్స్‌లో 100కి 100 మార్కులు, 14 మంది 90 మార్కులు సైన్స్‌లో 12 మంది 90 మార్కులు సాధించారన్నారు. నెల్లూరుతోపాటు బెంగుళూరు, వైజాగ్, రాజమండ్రి, తిరుపతిలలో గల బ్రాంచీలలో చదివిన విద్యార్థులు మంచి మార్కులు పొందారని ఆమె వివరించారు.

### లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్‌లో నెల్లూరీయుడు!

నెల్లూరీయుడు ఇందుకూరుపేటవాసి ఆత్మ కూరు రామకృష్ణ పదమూడు గంటల వ్యవధిలో 400 తైలవర్ణ చిత్రాలు గీసి లిమ్కా బుక్ ఆఫ్ రికా ర్డ్స్‌లో చోటు సంపాదించుకొన్నాడు. బెంగుళూరు లోని యశ్వంత్‌పూర్ స్టేడియంలో ఈ కళార్చనకు రామకృష్ణ దిగాడు. వారణాసిలో ఫైన్ ఆర్ట్స్ కోర్సు చదివిన రామకృష్ణ ప్రస్తుతం బెంగుళూరులోని సెం ట్రల్ యూనివర్శిటీలో ఆర్ట్స్ విభాగంలో ప్రొఫె సర్‌గా పనిచేస్తున్నాడు.

## జనవాణి

2వ పేజీ కొరవ

తిష్టవేసి వున్నాయి. ఆధునీకరణ పేరుతో గ్రంథా లయంలో ఏర్పాటుచేసిన రెండు ఎయిర్ కండిష నర్లు పనిచేయడం మానేశాయి. ఇంటర్‌నెట్ పేరుకే. అదెప్పుడూ పనిచేయదు. గ్రంథాలయంలోని వేలాది గ్రంథాలలో ఎన్నో శిథిలావస్థకు చేరుకున్నాయి. విలు వైన గ్రంథాలను బైండింగ్ చేయిస్తే బాగుంటుంది.

సి.హెచ్.సురేష్‌బాబు నెల్లూరు

### పర్యావరణంపై దృష్టి పెట్టండి!

పర్యావరణ సమస్యలు మానవ జాతిని సం క్షోభం అంచులకు నెడుతున్నాయి. ఆహార కొరత, ఇంధన అభద్రత, నీటి కొరత, ధరల పెరుగుదల, మండుతున్న ఎండలు, విజృంభిస్తున్న వ్యాధులు, ప్రకృతి విపత్తులు, పర్యావరణం ప్రతికూల మార్పుల ఫలితమేనని నిపుణులు గట్టిగా హెచ్చరిస్తున్నారు. మానవాళి అప్రమత్తం కాని పక్షంలో పర్యవసా నాలు తీవ్రంగా వుంటాయని వెల్లడిస్తున్న నేపథ్యంలో ప్రజల్లో పర్యావరణ స్పృహ పెంపొందించాల్సిన ఆవ శ్యకత ఎన్నడూలేని విధంగా పెరిగింది. పర్యావరణ పరిరక్షణ దిశగా పాశ్చాత్య దేశాల్లో ప్రజలు స్పంది స్తున్నంత వేగంగా సగటు భారతీయులు అడుగులు కదపలేక పోతున్నారు.

పి.అరుణకుమారి నెల్లూరు

## పిల్లి కూనైపోయిన పులి

మొదటి పేజీ కొరవ

వున్న పార్టీని చీల్చి లేదా కొత్త పార్టీ పెట్టి సాధించేది ఏమీ లేదని స్వంత అనుచరులే పెదవి విరుస్తు న్నారు. 2014 వరకు ఎదురు చూడడమే మేలన్నది వారి అభిమతం. మంత్రులు రాకుంటే ఎమ్మెల్యేలు కూడా వెనక్కు తగ్గుతారు. కొద్ది మంది కుర్రకారు ఎమ్మెల్యేలు మాత్రమే ఆవేశంతో ఊగిపోతున్నారు. ఆ సంఖ్య దేనికీ చాలదు. కనీసం 40 మంది అయినా తోడు వస్తారన్న నమ్మకం వుంటే ఏ నిర్ణయమైనా తీసుకోవచ్చు. అంతకు తగ్గితే ప్రజారాజ్యం, మజ్లిస్ వంటి పార్టీలు ప్రభుత్వాన్ని గట్టెక్కిస్తాయి. తాను అభాసుపాలౌతాడు.

తనవెవరైనా పులివెందుల పులి అంటే మహా ఇష్టం జగన్‌కు. తన తండ్రి తనకిచ్చిపోయిన ప్రజా దరణ, తరగని సిరిసంపదలు, అనుచరగణంతో కాంగ్రెస్ పార్టీలో పులివలె బ్రతకగలననుకొన్నాడు. కానీ పరిస్థితులు ఆయన్ను పిల్లికూన వలె మార్చి పారేశాయి. తన రాజకీయ భవిష్యత్తుకు తన చేతు లతోనే గొయ్యి త్రవ్వుకొన్నాడేమో అన్పిస్తున్నది. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వున్నప్పుడే ఈ నిధులు, ఈ అనుచరులు, ఈ జనాదరణ వున్నాయి. కానీ ఆయన వాటిని చూసి విర్రవీగలేదు. ఢిల్లీలో అధిష్ఠానం వద్ద వినయంగా మెలిగాడు. అనుకొన్న ప్రతిదీ సాధిం చాడు. కానీ జగన్‌కు ఆ నిగ్రహం అలవడలేదు. ఆ ఒక్క లోపంతోనే ఇంత తేడా.

వరంగల్ వెళ్తే గొడవ తప్పదన్న నిజం జగ న్‌కు తెలుసు. తెలంగాణ వాదనకు కేంద్ర బిందువు వంటి వూరది. తల గట్టిదా గోడ గట్టిదా అన్న అను మానం వస్తే, గోడకేసి తల కొట్టుకొని చూడడం తెలివితక్కువ అవుతుంది. జగన్ అదే పని చేశాడు. ఆయన అపరిపక్వతను ఆయన వ్యతిరేకులు బాగా వాడుకొన్నారు. వేసిన ప్రతి అడుగులో తప్పు వెతికి పట్టారు. ఒక్కవారం క్రితం జగన్‌ను చూసి అధి ష్ఠానం జడుసుకొన్నది. రాజ్యసభ ఎన్నికలలో తిరుగు బాటు అభ్యర్థిని పెట్టి పరువు తీస్తాడని భయప డింది. అందుకోసం చిరంజీవి సహాయం కోరింది. కానీ ఇప్పుడు అధిష్ఠానాన్ని చూసి జడుసుకోవలసిన దుర్గతి. వి.హనుమంతరావుకు టిక్కెట్ ఇస్తే ఒప్పు కొనేది లేదని హెచ్చరిక జారీ చేసిన జగన్, ఇప్పు డదే జరిగినా గుక్కిరి మిక్కిరనలేక పోతున్నాడు. శ్రీకాకుళంలో కూడా ఓదార్పు యాత్ర వద్దని ఢిల్లీ పెద్దలు చెప్పడంలో అర్థం లేదు. కానీ ఇదేమి అన్యా యమని ప్రశ్నించే సాహసం చేయలేక పోతున్నాడు. తన తల్లి, వైఎస్ సతీమణి శ్రీమతి విజయలక్ష్మి చేత సోనియా అనుగ్రహం కోసం దీనంగా లేఖ వ్రాయించ వలసిన దుస్థితి. చాలా విచారకర పరిణామం అది. వైఎస్ బ్రతికి వుంటే ఎంత మాత్రం హర్షించలేని లేఖాస్త్రం అది.

కేవలం ఓదార్పు మాత్రమే ఉద్దేశ్యమైతే అంత ఆడంబరం ఎందుకని వీరప్ప మొయిలీ వేసిన ప్రశ్నకు జగన్ వద్ద సమాధానం లేదు. పేరు ఓదార్పు అయినా పరమార్థం రాష్ట్రం మొత్తం మీద తన బలం పెంచుకొని, ప్రదర్శించడమని అందరికీ తెలుసు. ఓదార్పు మాత్రమే అయితే, నేరుగా కారేసుకొని వెళ్లి, ఆయా కుటుంబాలను పలకరించి రావచ్చు. దానికి ఎవరి అనుమతి అవసరం లేదు. చెప్పే ఉద్దే శం వేరు, సాధించదలచిన లక్ష్యం వేరైనప్పుడు కొంత నిగ్రహం తప్పనిసరి కదా?

కాంగ్రెస్‌లో నెగ్గుక రావాలంటే ఢిల్లీలో పలుకుబడి మైన లాబీ కావాలి. అందులో వైఎస్ విజయం సాధించాడు. జగన్ విఫలమైనాడు. ఒక్క కెవిపి రామచంద్రరావుకు ఢిల్లీ వ్యవహారాలు మొత్తం వదలి పెట్టడం ఆయన చేసిన తప్పులలో ఒకటి. అధిష్ఠాన దేవతలకు కెవిపి స్థాయి చాలలేదు. దాన్ని అవకాశంగా తీసుకొని జైపాల్‌రెడ్డి, కె.కేశవరావు, మధు యాష్కీ వంటివారు జగన్ వేసే ప్రతి అడు గులో తప్పు వెతికి పట్టి, సోనియాగాంధీ మనసు విరిచేశారు. ఢిల్లీలో జగన్‌కు నిలువ నీడ లేకుండా చూశారు.

మొత్తానికి చీలు రోడ్ల కూడలిలో వున్నా డిప్పుడు జగన్. ఏ దారి ఎంచుకోవాలో నిర్ణయిం చుకోవడం కష్టంగా మారింది. ఈ దశలోనైనా ఆయన వైఎస్ అభిమానులు, అనుచరులతో సమగ్రంగా చర్చ జరిపి, సరైన నిర్ణయం తీసుకొంటే రాజకీయ భవితవ్యం బాగుంటుంది. ఇప్పుడు కూడా తొందరపాటు నిర్ణయాలు తీసుకొంటే ఆ తర్వాత చింతించి ప్రయోజనం వుండదు.



## మళ్లీ రాజ్యసభ

మొదటి పేజీ కొరవ

ప్రాభవం వెయ్యి వోల్టుల కాంతితో ప్రకాశిస్తుందని ఆశ పడ్డారామె. అందుకోసం ఎంత దిగజారుడుకూ సందేహించలేదు. జనార్ధనరెడ్డి సోదరుడు నేదురు మల్లి పద్మనాభరెడ్డిని మచ్చిక చేసుకొని, మాయ చేసి, లేనిపోని ఫిర్యాదులతో ఢిల్లీ అంతా తిప్పారు. ఎప్పుడూ ఇంటి గడప దాటి ఎరుగని పద్మనాభరెడ్డి సతీమణిని కూడా ఢిల్లీ గడప ఎక్కించింది పనబాక లక్ష్మి. అహ్మద్ పటేల్‌తో తనకున్న సాన్నిహిత్యం వల్ల, సోనియాగాంధీ ఆంతరంగిక కార్యదర్శి కుమారి షెల్జాతో వున్న స్నేహం దృష్ట్యా తన మాట నెగ్గుతుం దని భ్రమించింది. కానీ ఆమె ప్రయత్నాలన్నీ జనా ర్ధనరెడ్డి చాణక్యం ముందు హనుమంతుడి ఎదుట కుప్పి గంతుల వలె మిగిలిపోయాయి. అయితే, తనకు రాజకీయ జన్మ ప్రసాదించి, ఎక్కడో గృహి ణిగా వంటింటికి పరిమితమైన ఆమెను ఒకటికి మూడుసార్లు ఎమ్పీగా గెలిపించిన నాయకుడి పట్ల పనబాక లక్ష్మి ఇంత నిర్దయగా ప్రవర్తించడం విచార కరం. ఎంత రాజకీయమైనా ఇంత అమానవీయంగా ప్రవర్తించవలసిన అవసరం వుందా?

జనార్ధనరెడ్డికి రాజ్యసభ సభ్యత్వం పెద్ద పదవి కాదు. ఈ రోజు రాష్ట్ర రాజకీయాలలో ఒక వెలుగు వెలుగుతున్న మంత్రులు, నేతలు గోలీలు ఆడుకొనే వయస్సులో వున్నప్పుడే, 40 ఏళ్ల క్రితం, 1972లో ఇదే రాజ్యసభకు ఎన్నికైనారాయన. ఆయన చూడని చట్ట సభ లేదు. శాసనసభ, శాసన మండలి, లోక్‌సభ వంటివన్నీ ఆయన్ను వరిం చాయి. రాష్ట్ర మంత్రి అయ్యాడు. ముఖ్యమంత్రిగా కూడా చేశాడు. కేంద్రంలో పలు ఉన్నత పదవులు అలవోకగా అనుభవించాడు. అంతటి రాజకీయ చరిత్ర వున్నవాడికి ఇప్పుడొచ్చిన రాజ్యసభ సభ్య త్వం వల్ల అదనంగా సమకూరే వన్నెలు, చిన్నెలు ఏమీ వుండవు. సుదీర్ఘ ప్రయాణంలో ఇదొక చిన్న మజిలీ మాత్రమే. అయితే కేంద్రంలో మంత్రిత్వం ఆయనకు తీరని కోరిక. ఈ పర్యాయం ఆ ముచ్చట తీర్చడం కోసమే భగవంతుడు ఈ అవ కాశం ఇచ్చినట్లున్నాడు. ఆయన అభిలాష నెర వేరాలని ఆశిద్దాం.

# జనాభా లెక్కల్లో కుల వివరాలు సేకరించడం సబబే!

దేశవ్యాప్తంగా గత నెల ఏప్రెల్ 26 నుంచి జనాభా గణన కార్యక్రమానికి కేంద్రప్రభుత్వం శ్రీకారం చుట్టింది. జనాభా గణాంకాలు సేకరణ భాగంగా గ్రామాల్లోని ప్రతి ఇంటిని సందర్శించి కుటుంబ యజమానికి సంబంధించిన పూర్తి వివరాలు తీసుకుంటున్నాయి. కుటుంబానికి అవసరమైన మౌలిక సదుపాయాలైన త్రాగునీరు, బ్యాంకు సేవలు, విలువైన వస్తువుల వివరాలు దాదాపు 35 కాలాల ప్రొఫార్మాలో పొందుపరుస్తున్నారు.

అయితే వెనుకబడిన తరగతుల వారి వివరాలు సేకరించే క్రమంలో ప్రభుత్వం జారీ చేసిన నిర్ణీత ప్రొఫార్మాలో కులం నమోదు చేర్చలేదు. దీంతో దేశవ్యాప్తంగా వున్న బి.సి కులాలకు చెందిన ప్రజాప్రతినిధులు పార్లమెంటు సమావేశాల్లో పట్టుబట్టి కులం నమోదుకు ఆమోదం పొందారు. స్థానిక సంస్థల ఎన్నికల దగ్గర నుంచి రాజ్యాంగ బద్ధమైన రిజర్వేషన్లలో బి.సిలకు అవకాశం లేదు. సుప్రీంకోర్టు కెళ్లినా లేకుంటే ఇతర సంస్థల వద్దకు వెళ్లిన సమయంలో బి.సిలకు సంబంధించి జనాభా లెక్కలు లేవని చెతులెత్తేస్తున్నారు.

దీంతో తీవ్ర ఆవేదనకు లోనైన బి.సి కులాల ప్రజాప్రతినిధులు ప్రస్తుతం దేశవ్యాప్తంగా జరుగుతున్న జనాభా గణన కార్యక్రమంలో ఎటువంటి ఖర్చు లేకుండానే 36వ కాలంను చేర్చి బి.సి. కులాన్ని నమోదు చేయాలని కేంద్రప్రభుత్వంపై ఒత్తిడి తీసుకొచ్చారు. మహిళా రిజర్వేషన్ బిల్లులో 5శాతం బి.సిలకు కేటాయించాలన్న ప్రతిపాదన కూడా వచ్చింది. ప్రస్తుతం ఈ అంశం పెండింగ్‌లోనే వుండిపోయింది. మండల కమిషన్ ఏర్పాటుచేసిన సమయంలో కూడా బి.సిలకు సంబంధించిన జనాభా గణనలో కులాన్ని చేర్చడంతోపాటు కుటుంబ, ఆర్థిక విషయాలను నమోదు చేయాలని సుప్రీంకోర్టు సూచించింది.

తొలిదశలో చేపట్టిన జనాభా గణనలో బి.సి కులాన్ని చేర్చలేకపోవడంతో రెండవ దశలో చేపట్టిన జనాభా గణనలో తప్పని సరిగా కులాన్ని నమోదు చేసే విధంగా కేంద్రప్రభుత్వం అంగీకరించింది. దీంతో మన రాష్ట్రంలో రెండవ దశ జనాభా గణనలో బిసిలకు సంబంధించిన పూర్తి వివరాలు నమోదు చేసే అవకాశం వుంది. ఈ నేపథ్యంలో కులం నమోదుపై పలువురు వెల్లడించిన అభిప్రాయాలను దిగువనిస్తున్నాం.



జనాభా లెక్కలను చూసే నెల్లూరులోని గణాంకాధికారి కార్యాలయం.

### రిజర్వేషన్లు ఉండాలి

వెనుకబడిన తరగతుల వారికి రాజ్యాంగ బద్ధమైన రిజర్వేషన్లు అందాలంటే జనాభా లెక్కల్లో బిసి కులాలను తప్పనిసరిగా చేర్చాల్సిన అవసరం వుంది. ప్రస్తుతం జరుగుతున్న జనాభా వివరాలలో కులం నమోదు చేస్తే భవిష్యత్తులో పిల్లలకు ఎంతో ఉపయోగకరంగా వుంటుంది. ఇన్ని సంవత్సరాల తర్వాత కేంద్ర ప్రభుత్వం స్పందించడం శుభపరిణామంగా పేర్కొనవచ్చు.

- నక్కా శీనయ్య.

### రిజర్వేషన్ అవసరం

ప్రస్తుతం వున్న జనాభా ప్రకారం బిసిలకు అన్ని రంగాలలో రిజర్వేషన్ కల్పించాల్సిన అవసరం వుంది. ఎస్సీ, ఎస్టీలకు ఏ ప్రాతిపదికన రిజర్వేషన్ సౌకర్యం వుందో అదేవిధంగా బి.సిలకు ఏర్పాటు చేయాలి. ఇప్పటివరకు బి.సిలకు సంబంధించి కులాల వారీగా వివరాలు లేని కారణంగా రిజర్వేషన్లు అమలు కాకుండా పోయాయి.

- బాషా.

# కారుణ్య నియామకాలపై సందిగ్ధం

**విధి నిర్వహణలో మరణించిన ప్రభుత్వ ఉద్యోగుల కుటుంబీకులకు ఇవ్వాల్సిన కారుణ్య ఉద్యోగాల విషయమై జిల్లా అధికారులు మీనమేషాలు లెక్కిస్తున్నారు. దీనివల్ల ఆ కుటుంబీకులు నానాపాట్లు పడుతున్నారు.**

విధి నిర్వహణలో మరణించిన వారి కుటుంబ సభ్యులకు కల్పించే కారుణ్య నియామకాలపై ప్రస్తుతం సందిగ్ధం నెలకొంది. గతంలో ఈ వుద్యోగాల నియామకాలు త్వరితగతిన జరిగేవి. సంవత్సరాల తరబడి నిరీక్షణ చేస్తున్నా అటు ప్రభుత్వం గాని, ఇటు అధికారులు గాని ఏ మాత్రం వీటి గురించి పట్టించుకోవడం లేదు. అధికారులు కనికరం చూపకపోవడంతో మరణించిన వుద్యోగుల కుటుంబసభ్యులు వివిధ రకాలుగా ఇబ్బంది పడుతున్నారు.

కారుణ్య నియామకాలకు సంబంధించి జిల్లా కలెక్టర్‌కు పూర్తి అధికారాలుంటాయి. ఈ ఉద్యోగాల ఖాళీల వివరాలను జిల్లాలోని వివిధ ప్రభుత్వ శాఖల నుంచి ముందుగా సేకరించాల్సి వుంటుంది. అవసరాన్ని బట్టి ఆయా శాఖలలో ఏర్పడిన ఖాళీలను కారుణ్య నియామకాల క్రింద భర్తీ చేస్తారు. ప్రస్తుతం జిల్లాలోని పలు ప్రభుత్వ శాఖలలో అనేక ఉద్యోగ ఖాళీలు వున్నాయి. కొన్ని శాఖలలో సిబ్బంది కొరత కారణంగా పనులు జరగడం లేదు. గతంలో కారుణ్య ఉద్యోగ నియామకాలలో కొన్ని శాఖల అధికారులు చేతివాటం కూడా ప్రదర్శించేవారు.

కారుణ్య ఉద్యోగాల కోసం దరఖాస్తు చేసుకొన్న వారి వివరాలను సేకరించి శాఖలో పోస్టింగ్ ఇప్పించుకునేవారు. ఇందుకు ప్రతిఫలంగా 30 వేల నుంచి 50 వేల రూపాయల వరకు వసూలు చేసుకునే వారు. శాఖలవారీగా ఖాళీల వివరాలు సకాలంలో అందకపోవడం కారణంగా ఆలస్యం జరిగిపోతుందన్న వుద్దేశంతో ఉద్యోగ నియామకాలు జరిపేవారు. బాధితులు ఎక్కడ ఉద్యోగం చేయిజారి పోతుందోనని భయపడి బయట అప్పులు చేసి అడిగిన మొత్తాన్ని వెనుకా ముందు ఆలోచించకుండా ముట్టజెప్పిన సంఘటనలు వున్నాయి.

జిల్లా వున్నతాధికారి పేరు చెప్పి వసూళ్ళ జరగ్గా అప్పట్లో పెద్ద దూమారం రేగింది. దీంతో కారుణ్య ఉద్యోగులకు సంబంధించిన ప్రక్రియ పూర్తిగా నిలిచిపోయింది. అయితే ఈ ఉద్యోగాల కోసం ఎప్పటి నుంచో ఎంతో ఆశగా ఎదురుచూస్తున్న బాధితులకు ఇది శాపంగా పరిణమించింది. కారుణ్య నియామకాలలో ప్రధానంగా అటెండర్లు, వసతిగృహాల్లో సర్వెంట్లు, వాచ్‌మెన్‌లగానూ, 10వ తరగతిపైన ఉత్తీర్ణత వుంటే పంచాయితీ కార్యదర్శులుగానూ ఉద్యోగాలిస్తుంటారు. జిల్లా కలెక్టరేట్‌లో కారుణ్య ఉద్యోగాలకు సంబంధించి పలు ఫైళ్లు పెండింగ్‌లో వున్నాయి.



కలెక్టరేట్‌కు కరుణ కలిగేదెప్పుడు?

బాధితులు ప్రతి సోమవారం జరిగే ప్రజావిజ్ఞప్తుల దినంలో కలెక్టర్‌ను కలిసి విన్నవించుకుంటూ ఉన్నా న్యాయం చేయలేకపోతున్నారు. ఒక ప్రక్క వయస్సు మీద పడుతున్న, మరో ప్రక్క కుటుంబాల ఆర్థిక పరిస్థితి దిగజారి పోతుంది. కొందరు బాధితులు వారి అసెంబ్లీ నియోజకవర్గాల ఎమ్మెల్యేల నుంచి కూడా సిఫార్సు చేయించుకుంటున్నా కలెక్టరేట్‌లో ఫైలు మాత్రం ఒక్క అడుగు ముందుకు కదలడం లేదు. ప్రభుత్వం వైపు నుంచి ఈ ఉద్యోగుల నియామకాలు జరపమని అనుమతి రావాలని కొందరు అధికారులు చెబుతున్నారు.

ఆర్థికశాఖ నుంచి గ్రీన్‌సిగ్నల్ వచ్చిన వెంటనే దరఖాస్తు చేసుకున్న బాధితులందరికీ నియామకాలు జరుపుతామని వ్యాఖ్యానిస్తున్నారు. అయితే రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఇబ్బందిగా వుండడంతో ఈ నియామకాల వలన మరింత ఆర్థిక భారం పడనున్న దృష్ట్యా వీటికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చేందుకు ప్రభుత్వం నిరాకరించింది. ఏది ఏమైనా కారుణ్య ఉద్యోగాల నియామకాలలో విషయంలో రాష్ట్ర ప్రభుత్వం చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుందన్నది వాస్తవం.

# టిఎస్‌ఆర్‌కు పెద్ద బాధ్యత!



రాజ్యసభ సభ్యుడు, నెల్లూరీయుడు, అటు వ్యాపారంలో, ఇటు రాజకీయంలో తాను అనుకొన్న సోపానాలన్నీ అధిరోహించిన అపర చాణక్యుడు, పట్టిందల్లా బంగారం చేసుకొనే విద్యలో అభినవ పరసువేది, అదృష్టదేవతను అనుంగు నెచ్చెలిగా మలచుకొన్న మహర్జాతకుడు తిక్కవరపు సుబ్బరామరెడ్డి మరొకసారి ఢిల్లీ దివాణంలో తన ప్రాభవాన్ని చాటుకొన్నాడు. పార్లమెంటులో అత్యంత కీలకమైన స్టాండింగ్ కమిటీకి ఛైర్మన్‌గా నియమితులైనారు. పర్యావరణం, అడవులు, రోదసీ పరిశోధన, అణుశాస్త్రం, బయో టెక్నాలజీ, సైన్స్ అండ్ టెక్నాలజీ, సముద్ర పరిశోధన వంటి ఎనిమిది కేంద్రమంత్రిత్వ శాఖలు ఈ కమిటీ పర్యవేక్షణకు వస్తాయి. వాటిలో కొన్ని నేరుగా ప్రధాని మన్మోహన్ సింగ్ నిర్వహణలోనివి కావడం విశేషం. పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీలది చాలా గురుతరమైన బాధ్యత. పార్లమెంటు చేసే చట్టాలు, శాసనాలకు అనుగుణంగా మంత్రిత్వ శాఖలు పని చేస్తున్నదీ లేనిదీ పరిశీలించి, పార్లమెంట్‌కు నివేదిక ఇవ్వడం ఈ కమిటీల పాత్ర. ఒకేసారి ఎనిమిది మంత్రిత్వ శాఖలకు చెందిన కమిటీకి సుబ్బరామరెడ్డిని ఛైర్మన్ చేశారంటే ఆయన కార్యదక్షత మీద సోనియా గాంధీకి వున్న నమ్మకం ఎంతటిదో చెప్పకనే చెప్తుంది. రాష్ట్ర రాజకీయాలలో సుబ్బరామరెడ్డిది విలక్షణ శైలి. తనకంటూ ఒక వర్గం వుండదు. ఏ వివాదంలోనూ తలదూర్చడు. రాష్ట్ర స్థాయిలో అటు ప్రభుత్వంలో కానీ, ఇటు పార్టీలో కానీ చిన్న పదవి కూడా అడగడు. వేరొకరికి సిఫార్సు చేయడు. కానీ ఢిల్లీలో ఆయన ప్రభ ఎప్పుడూ దేదీప్యమానంగా వెలుగుతూ వుంటుంది. వైఎస్ వంటి వాడు కూడా ఢిల్లీ పెద్దలను మచ్చిక చేసుకోవాలంటే సుబ్బరామరెడ్డి సహకారం తీసుకొనేవాడు. తామరాకు మీద నీటి బొట్టు వలె ఎవరికీ అందక ఎవరికీ చెందక వుంటూ, అందరికంటే ఒక మెట్టు పైన వుండగలగడం సుబ్బరామరెడ్డి నేర్పరితనం. అందువల్లనే ఆయన్ను పదవులు, రాజకీయ బాధ్యతలు వెతుక్కొంటూ వస్తున్నాయి. పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ఛైర్మన్‌గా బాధ్యత తీసుకొన్న సుబ్బరామరెడ్డి గారికి మా అభినందనలు.






# అయ్యో పాపం... చిరంజీవి!



రాజ్యసభ ఎన్నికలలో కాంగ్రెస్‌కు బేషరతు మద్దతు ప్రకటించి, తన రాజకీయ అజ్ఞానాన్ని మరొకసారి చాటుకొన్నాడు ప్రజారాజ్యం అధినేత చిరంజీవి. కాంగ్రెస్‌కు కీలకమైన ఎన్నికలవి. వారికి ముగ్గురిని మాత్రమే గెలిపించుకొనే వీలుంది. నాలుగవ స్థానానికి పన్నెండు ఓట్లు తక్కువ. మజ్లిస్ బలం వుందనుకొన్నా, వారి ఎమ్మెల్యేలు ఏడుగురు మాత్రమే. మరొకప్రక్క వైఎస్.జగన్ తిరుగుబాటు బెదరింపు చేస్తున్నాడు. అదే జరిగితే నాలుగవ స్థానం గోవిందా. ఆ ప్రమాదం తప్పించుకోవడానికి చిరంజీవి సహకారం తీసుకోవాలనుకొన్నారు. అవసరం కాంగ్రెస్ పార్టీది. జగన్ సాహసించి ఒక స్వతంత్ర అభ్యర్థిని రంగంలోకి దింపితే పార్టీ పరువు పోతుంది. ఓటుకు రెండు కోట్లు ఇచ్చి అయినా రాజ్యసభ సభ్యుణ్ని కావాలనే తమకంతో డెక్కన్ క్రానికల్ వెంకట్రామిరెడ్డి కాచుకొని వున్నాడని అందరికీ తెలుసు. రాజకీయాలలో ఇటువంటి అవసరాలను ఉపయోగ పెట్టుకోగల్గినవాడే నాలుగు కాలాలపాటు నిలుస్తాడు. చిరంజీవి సహకారం కావాల్సినప్పుడు కాంగ్రెస్ పార్టీ ఆయన వద్దకు సోనియా స్థాయిలో దూతను పంపి చర్చలు జరపాలి. కనీసం పిసిసి అధ్యక్షుడైనా సహాయం అభ్యర్థించాలి. కానీ అదేమీ జరగలేదు. ఎవరో మధ్యవర్తి సలహాతో తనంతట తానుగా సోనియాగాంధీ అపాయింట్‌మెంట్ అడిగాడు. ఢిల్లీ వెళ్లాడు. పోనీ అక్కడైనా రాజకీయ జ్ఞానంతో మాట్లాడాడా అంటే అదీ లేదు. ఇటువంటి సందర్భాలలో చావుకు పెట్టి, లంకణం సాధించుకోవడం రాజకీయ చాణక్యమౌతుంది. చిరంజీవి ఆ నాలుగవ స్థానం తనకు ఇవ్వాలనే ప్రతిపాదనతో మాటలు మొదలుపెట్టి వుంటే సోనియా స్పందన వేరుగా వుండేది. అయితే ఆయనకు ఆ అవకాశం ఇవ్వకుండా, మాకు నాలుగు స్థానాలు గెల్పించుకోవాల్సి వుంది కాబట్టి, మీ ఓట్లు వేయండి అని అడిగి సరిపెట్టింది సోనియాగాంధీ. ఈయన తల వూపి బయటకు వచ్చాడు. సరైన పద్ధతిలో బేరం నడిపి వుంటే, రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రిపదవులు ఇచ్చేందుకు కూడా ఆ సమయానికి సోనియా సిద్ధంగా వుందని వినికిడి. ఒకసారి మాట ఇస్తే ఆమె వెనక్కు వెళ్లలేదు. అయితే చిరంజీవి ఏమీ అడగలేదు. ఏ బేరమూ నడపలేదు. ఆమె చెప్పింది విని, తల వూపి తిరిగి వచ్చాడు. ఆయన అమాయకత్వాన్ని చక్కగా వాడుకొన్నది కాంగ్రెస్‌పార్టీ. ఏ హామీ ఇవ్వాల్సిన పని లేకుండా రాజ్యసభ ఎన్నికలలో పోటీ లేని అనుకూలత సాధించింది. ప్రజారాజ్యం ఎమ్మెల్యేలు చాలా ఆశతో వుండినారు పాపం. కొందరైతే మంత్రులైపోయినట్లు కల కన్నారు. చివరకు మిగిలింది ఆశాభంగం, రాజకీయాలు చేతకాని వాడన్న అభిప్రాయం. అయ్యో పాపం చిరంజీవి.



## కార్టూన్ స్కేప్




డాడీ! భూ ఆకర్షణ శక్తి కిందికా మీదికా?!

# మొక్కుబడి మహానాడు

తెలుగుదేశం పార్టీకి మహానాడు అంటే, తిరుమల వెంకన్నకు ముక్కోటి ఏకాదశితో సమానం. ఎన్టీరామారావు దానికంత ప్రాధాన్యత ఇచ్చేవాడు. మహానాడుకు హాజరయ్యే కార్యకర్తలకు జీవన్‌టోన్ టానిక్ త్రాగినంత ఉత్సాహం కలిగేది. పార్టీ పట్ల మక్కువ పెరిగేది. నేతలకు ఆత్మపరిశీలనా వేదికగా ఉపయోగపడేది. కానీ ఈ వారంలో చంద్రబాబు నాయుడు జరిపించిన మహానాడులో ఈ లక్షణాలు ఒక్కటి కూడా కాగడా వేసి వెతికినా కన్పించలేదు. అంతా మొక్కుబడి వ్యవహారం. తెలుగుదేశం పార్టీ వరసగా రెండవసారి ఎన్నికలలో ఓడిపోయి ఏడాది అయిన సందర్భం. వైఎస్ వంటి మహానేతను కోల్పోయి కాంగ్రెస్ పార్టీ అనాధగా మిగిలిన చారిత్రక సమయం. వైఎస్.జగన్ జగడాలతో రాష్ట్ర రాజకీయాలు కల్లోలభరితంగా మారుతున్న తరుణం. రోశయ్య ప్రభుత్వం వుండీ దండగ అన్న నిస్పృహలో ప్రజలు నిట్టూర్పులు విడుస్తున్న పరిస్థితి. ఇటువంటి సమయంలో జరిగే మహానాడులో ఎంతటి వేడి వుండాలి? ఎంత వాడిగా కన్పించాలి? కానీ అవేమీ లేవు. చెప్పలేని నిస్తత్తువ, నీరసం ఏదో ఆ పార్టీని ఆవహించాయా అన్న భావన కల్గింది మహానాడు జరిగిన తీరు చూస్తే. హాజరైన కార్యకర్తలకు కూడా అదే అభిప్రాయం. పార్టీ మీద మక్కువ పెరిగే సంగతి దేముడెరుగు, వున్న నమ్మకం నశించిపోయే పరిస్థితి. రోశయ్య ప్రభుత్వాన్ని విమర్శించాలంటే చంద్రబాబు సంకోచిస్తున్నాడు. ప్రభుత్వానికి ప్రమాదం ఏర్పడితే రోశయ్య స్థానంలో జగన్ వచ్చి కూర్చుంటాడని భయపడుతున్నాడు. దానితో ప్రతిపక్షంగా ప్రభుత్వాన్ని విమర్శించలేని బలహీనత. దానితో ఉపన్యాసాలు, తీర్మానాలు మొక్కుబడిగా మారాయి. ఒక్కరి మాటలు కూడా కార్యకర్తలకు ఉత్తేజం కల్పించలేకపోయాయి. ఇంత నాసిరకం మహానాడు తెలుగుదేశం చరిత్రలో ఎప్పుడూ చూడలేదు.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.